# సోవియట్ భూమి

సం. 17 సెప్టెంబరు 13, 1957

వెల 20 నయాపైసలు


Pace Ystävyys 和平

친선



mir Peace miqësia

barátság

DRUŽBA PAIX Frieden

prijateljstvo

शांति МИР amitié

Vrede Rauha

amistad

PAZ صلح

Béke

Friendship






## ఈ సంచికలో

* శాంతి స్నేహాల మహోత్సవం, ఉత్సవానికి సంబంధించిన అనేక ఇతర వ్యాసాలు, చిత్రాలు.
* సోవియట్ దేశంలో భారత స్వాతంత్ర్య దినోత్సవం.
* సోవియట్ దేశంలో హోమియోపతీ వైద్యం.
* నూతన చారిత్రక దశ నందుకొన్న సోవియట్ దేశ ఆర్థిక వ్యవస్థ.
* మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థి, మధుకర్ దేశ్‌ముఖ్,
* నూతన పాఠ్య సంవత్సరం.

# మీకు తెలుసా...

కజకస్తాన్ సోవియట్ దేశంలోని పదిహేను రిపబ్లిక్కులలో ఒకటి.

★

కజకస్తాన్, విప్లవానికి పూర్వం ఎంతో వెనుకబడిన ప్రాంతం, ఇప్పుడు, సోవియట్ దేశంలో అధికాధికంగా అభివృద్ధి చెందిన రిపబ్లిక్కులలో ఒకటి.

★

ఒకప్పుడు దారిద్ర్యానికి గురైన **కజకస్తాన్** ప్రజలు, ఇప్పుడు సుసంపన్నులు.

★

ఒకప్పుడు, రాజకీయంగా ఏ హక్కులూ లేని **కజకస్తాన్** ప్రజలు ఈనాడు తమ దేశానికి అధిపతులై రాజకీయపు సర్వ హక్కులను, ఇతర ప్రాథమిక పౌరస్వత్వాలను అనుభవిస్తున్నారు.

★

*కజకస్తాన్ జీవిత, బహుముఖ రీతుల మీకు విశదం చేసే*

రాబోవు

## సోవియట్ భూమిని

చదవండి

★

రానున్న ఈ సంచికలో, ఇంకా, ఉత్సవానికి సంబంధించిన అమూల్య సమాచారం; సోవియట్ సాహిత్య ప్రగతి: ప్రథమ దశకం మొదలైన వ్యాసాలు, వార్తా చిత్రాలు వుంటాయి.

★

## నేడే మీ ప్రతికై త్వర పడండి!

సంపుటి 8
సంచిక 17

# సోవియట్ భూమి

సెప్టెంబర్ 13, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక

## శాంతి స్నేహాల మహోత్సవం

ఆరవ ప్రపంచ యువజన, విద్యార్థి మహోత్సవము ఆగస్టు పదకొండవ తేదీన మాస్కోలో ముగిసింది. మహోత్సవంలో పాల్గొన్న 34,000 మంది యువతీ యువకులలో చాలా మంది తమతమ దేశాలకు తిరిగి వెళ్ళారు.

ఈ మహోత్సవానికి వచ్చినవారు ఒకేవిధమైన దృక్పథాలనుగాని, అభిప్రాయాలనుగాని, నమ్మకాలనుగాని కలిగి వున్నవారు కారు. వారిలో విభిన్నరకాల యువజనులు, నల్లవారు, తెల్లవారు, కేతలిక్కులు, ముసల్మానులు, సామ్యవాదులు, మితవాదులు, యూదులు, అరబ్బు జాతీయులు వున్నారు.

వారు అనేక మాసాలపాటు శ్రమపడి సన్నద్ధులయ్యారు. అనేక కష్టాలకు గురియై ఎన్నెన్నో త్యాగాలు చేశారు, అంతటి దూర దేశాలనుండి రావడానికి కొన్ని సందర్భాలలో నిర్బంధాలకుగూడా గురి కావలసి వచ్చింది అన్న విషయాలు ఎంతైనా ప్రాముఖ్యతను కలిగివున్నాయి. అది అతిశయోక్తి కానేరదు. ఎందుకంటే, బ్రహ్మాండంగా జరిగిన ఈ మహోత్సవాన్ని చూచినట్లయితే, ఇదంతా యెలా సాధ్యమయిందన్న ప్రశ్న మనకెదురవుతుంది. అక్కడ ఆనందకరమైన విషయాలు, ఉత్సవాల్లో జరిగే అనేక రకాలైనవిషయాలు జరిగాయన్నది నిర్వివాదాంశం. కానివీటన్నిటికీ మించిన విషయంకూడా వున్నది. ఉత్సవంలో పాల్గొన్నవారుగాని, వాటి ఏర్పాటుతో యేకొద్ది సంబంధం వున్నవారుగాని అది శాంతి, స్నేహాలయొక్క అత్యంత ప్రధానమైన మహోత్సవమన్న విషయాన్ని గుర్తించడంలో పొరపాటు పడలేదు. అన్నిటికీమించి, శాంతి, స్నేహాల యీ మహోద్దేశమే, అన్నిరకాల దృక్పథాలుగల యువజనులు ఒకచోటచేరేటట్లు చేసింది.

సోవియట్ యువజనులు, సోవియట్ ప్రజలు సంబంధించినంత మట్టుకు వారు ప్రపంచ యువజనులకుఆతిధ్యం యివ్వడానికీ, యుద్ధాల మూలంగా అత్యంత నష్టాలను పొంది, అనేక త్యాగాలను చేసిన తాము మరొక యుద్ధాన్ని కోరడంలేదనీ సకల దేశాల యువజనులతో మిత్రులుగావుండాలని అభిలషిస్తున్నామనీ తెలియజేయడానికీ ఎంతోఆనందపడ్డారు. వారు చేతులను చాచగా, ఇతరులు వాటితో తమచేతులను కలిపారు. యువజనుల యొక్క యీ చేతుల కలయిక, వివిధ ప్రజలను విడదీసి మరొక యుద్ధానికి పైశాచిక సన్నాహాలనుజరుపుతున్నవారిని అరికట్టగలదు.



# మాస్కో






## ప్రపంచ యువజనులకు

విూ పెద్దలమైన మాకు రెండవ ప్రపంచ యుద్ధంవల్ల కలిగిన మానవ నష్టాన్ని గురించి, దానివల్ల కలిగిన భయంకర ఫలితాలు, అవమానాలను గురించీ బాగా తెలుసు. మీలో చాలామందికి గూడా ఆ విషయాలు తెలుసు. మూడవ ప్రపంచ యుద్ధమే గనక వచ్చినట్లయితే అది అత్యంత భయంకరంగా వుంటుంది. కాని, బ్రహ్మాండమయిన మొత్తాలు ఆయుధోత్పత్తిపై వ్యయం చేయబడుతూ, దానివల్ల తప్పనిసరిగా మనందరి జీవిత ప్రమాణాలు పడిపోతూవున్న "ప్రఛ్చన్నయుద్ధ"పు, యుద్ధసన్నాహక ప్రస్తుత పరిస్థితినీ సంశయ. ద్వేషాలతో మన మేధస్సులనూ, ఉదజనిబాంబుల పాటవ పరీక్షలతో మన శరీరాలనూ విషపూరితం చేయడాన్ని భరించడం కూడా దుస్సాధ్యమవుతున్నది.

కాబట్టి, శాంతిశక్తులకూ వాటిని యెదిరిస్తూన్న శక్తులకూ మధ్య నేడూ, ప్రతిదినమూ కొనసాగుతున్న పోరాటాన్నిగురించి యెన్నడూ మరువవద్దని, మీపెద్దల మయిన మేము వేడుకొంటున్నాము. ఈ పోరాటం ఇంకా విజయవంతం కాలేదు. కాని ప్రపంచంలోని అందరి కొరకూ ఇది విజయవంతం గావింపబడాలి. మనమందరమూ చాలా కష్టపడి పనిచేస్తే తప్ప యీ విజయం మనకు చేకూరుతుందని ఆశించడానికి వీల్లేదు. మనలో ఒక్కరమయినా యీ పోరాటంనుంచి దూరంగా ఉండటానికి వీలులేదు.

## మహోత్సవం

*మిర్, ఫ్రెండ్షిప్, విమిటి, పీస......*

వందలాది భాషల్లో ఉచ్చరింపబడుతున్న యీ మాటలు సముద్ర తరంగాల్లాగ ఉవ్వెత్తునలేచి పడుతున్నాయి. స్టేడియంలో కూచున్న నేను వాటిని వినసాగాను. పూర్తిగానిండిపోయి ఉన్నది స్టేడియం.

....వాతావరణమంతా, ఉత్సాహంతోను, ముందు జరుగబోయే వాటిని గురించి తెలుసుకోవాలన్న కుతూహలంతోనూ నిండి ఉన్నట్లు అందరికీ అగుపడసాగింది. స్టేడియంలోని పెద్ద గడియారం ముళ్ళు సమయాన్ని 2-30గా చూపుతున్నాయి. ఏంజరిగింది? ప్రతి నిధివర్గాలు స్టేడియంలోకి 2గంటలకే రావలసి ఉండినది. నాకు ఆదుర్దాకలిగింది. ఇలాంటి సమయాల్లో ఆలశ్యంజరిగితే సహించడం కష్టంగా ఉంటుంది........

కాని ఆ సమయంలో లౌడ్‌స్పీకర్ ప్రతిధ్వనించసాగింది ఊరేగింపు స్టేడియంకు రావడం ఒకగంట ఆలశ్యమవుతుంది. స్టేడియంకు వచ్చేముందు మాస్కో నగరమంతా మోటార్లలో ఊరేగుతున్న ప్రతినిధులకు మాస్కో



# జులై 28



మీరందరూ యీ పోరాటంలో పాల్గొనాలని మేము కోరుతున్నాము. కేవలం పాల్గొనడమేకాదు, ప్రముఖ పాత్రను గూడా వహించాలి. ఎందుకంటే ఇది ముఖ్యంగా మీకే దెబ్బతీస్తుంది. క్రొత్త యుద్ధం యేది ప్రారంభమయినా మొదటగా మృత్యువుకు గురి అయ్యేవారు మీరే. కాని మీరు ఈ ప్రపంచంలో ఇంకా ఎంతో కాలం జీవించవలసి ఉన్నారు. భవిష్యత్ ప్రపంచం మీదే.

త్వరలో తమ దేశాలకు తిరిగి వెళ్ళిపోనున్న ప్రతినిధులతో మీరు మాట్లాడి చూచినట్లయితే, అన్ని దేశాల ప్రజలు నిజమైన మిత్రులుగా ఉంటున్నారన్న విషయాన్ని మీరు తెలుసుకొన గలుగుతారు. యువజనులు ఒకరినొకరు చంపుకొనడం యెలా సాధ్యమవుతుందని అనిపించడమేగాక, అది వాస్తవంగా జరుగకుండా చూడవలసి ఉంటుంది మీరు. అణ్వాయుధ పాటవ పరీక్షల నిలుపుదలకు పట్టుపట్టి, సాధారణ నిరాయుధీకరణను కోరండి. యువజనులకు సహజమయిన యావత్తు శక్తి, సాహశాలతోను, ఉత్సాహంతోను మీ దేశంలోని శాంతి ఉద్యమంలో చురుకుగా పాల్గొనండి.

యుద్ధ ప్రమాదము, యుద్ధ సన్నాహక కీడు మాత్రమే మనకూ, సుస్థిరశాంతికీ మధ్య నిలుస్తున్నాయి. ఈ ప్రమాదాలు కీడులకు వ్యతిరేకంగా పోరాడండి. ఆనందదాయకమయిన ప్రపంచం రూపొందాలని కాంక్షిస్తున్నాము. శాంతియే జీవితం! శాంతి సుస్థిరంగా ఉండేటట్లు చూడండి.

(శాంతికొరకూ, దేశాలమధ్య మైత్రికొరకూ పోరాడుతున్నట్టి వివిధ దేశాలనుండి వచ్చిన ప్రముఖ నాయకులు హాజరైన ప్రపంచ యువజన ప్రతినిధుల సమావేశంలో యీ విజ్ఞాపనను డి.ఎన్. ప్రిట్ చదివారు.

జేమ్స్ ఎండికాట్, ఇల్యా ఎహ్రెన్‌బర్గ్, మేరీ ప్రిట్, ఎన్. తిఖొనోవ్, ఎ. మరెస్యేవ్, సెర్గియో రెకబెర్రెన్, నాజిమ్ హిక్మెత్, తదితరులు యీ విజ్ఞప్తిపైన సంతకం చేసారు.)

## దినచర్య

వాసులు బ్రహ్మాండమైన స్వాగతం ఇస్తుండడంవల్ల ఇలా ఆలశ్యమవుతున్నది.

ప్రజలు నిశ్శబ్దంగా వింటున్నారు. అనౌన్సరు ఇంకా ఇలా చెప్పసాగాడు: ప్రియమైన అతిధులకు స్వాగతమివ్వడానికి ఇరవైలక్షల మంది ప్రజలు దారిపొడుగునా బారులుతీర్చి నిలుచున్నారు. ఉత్సవపు మోటార్లు అసలు కదలడమే కష్టంగా ఉన్నది. సుదూర దేశాలనుండి శాంతి స్నేహాల సందేశాలను తీసుకొనివచ్చిన ప్రతినిధులకు పూలగుత్తులను బహూకరించడానికీ, వారితో కరచాలనం చేయడానికీ, ప్రతి మాస్కో-వాసి కుతూహల పడుతున్నాడు.

ఆ నిశ్శబ్దాన్ని ఛేదించుకొంటూ ఒక బ్రహ్మాండమైన గలభా వినవచ్చింది. దాదాపు అందరూ మాట్లాడడం, కేకలు వెయ్యడం ప్రారంభించారు. కాని అవి క్రోధపూరితమైన కేకలుమాత్రం కావు; ఆనందాతిశయంతో కేకలు పెడుతూ అభినందిస్తున్నారు; నావెనుకవున్న లావాటిమనిషి ఇలా ఉద్రేకంతో అన్నాడు: "అతిధులకు స్వాగతమివ్వడ

(మిగత 6వ పుట చూడుడు)



ఎల్లలు లేవు!

నది నృత్యంచేస్తూ, గంతులువేస్తూ ప్రవహిస్తోంటుంది. పైకెగసే నీటి తుంపరలు సూర్య రశ్మిలో కిరీటాల్లాగ మెరుస్తుంటాయి. అది చూస్తుంటే వీణపై వినవచ్చే మధుర నిస్వనంలోని మనోజ్ఞత, సొగసు స్ఫురణకు వస్తుంటాయి. కాని అది అలానే ప్రవహిస్తూ పోయి సముద్రంలో సంగమించి, తన వలెనే ప్రవహిస్తూ వచ్చే ఇతర నదులతో కలుస్తుంది. తీరాలమధ్య వుండవలసిన నిర్బంధ స్థితినుండి విముక్తమై ముందుకు ఉరుకుతుంది. ఇంతవరకు చిన్నచిన్న అలలుగా ఉండినవి అప్పుడు బ్రహ్మాండమైన అలలుగా మారిపోతాయి. ఇది పరకటి మర్మర ధ్వని, గంభీరమైన ఒక స్వరంగా వినబడుతుంది.

యువజనుల ప్రవాహాలు ప్రపంచపు వివిధ ప్రాంతాలనుండి వచ్చి ఉత్సవంలో సంగ మించాయి. ఆ యువజనుల దళాలలో ప్రతిదీ ఒక విశిష్టతను కలిగివుండి, ఇతరవాటి నుండి విభిన్నంగావున్నది. వారు ఒకరినొకరు కలుసుకొన్నారు. అదే ఒక బ్రహ్మాండమైన సోదర మానవ సమ్మేళనంగా రూపొందింది. ఆనందోత్సాహాలు వెల్లివిరిసింది.

ఎంతో ప్రచారం గావింపబడే ఆ "ఇనుపతెర" యేది? దుష్ట మానవులు నిర్మించిన ఆ గోడలు యేవి? ఇనుపతెర లేదు! ఆ గోడలు కూలిపోయాయి! తాము సన్నిహితులమని గ్రహించిన మహదానందంలో యేలాంటి అరమరికలు లేకుండా ఒకరి నొకరు కౌగిలించుకొన్నారు, ముద్దుపెట్టుకున్నారు. "ఇంకెప్పుడూ మనం

"పెరనిత్సా" నృత్యంలో చెట్టాపట్టీ పట్టుకపోదాం, ఇక్కడ (రుమేనియన్ జానపద నృత్యం)





స్నేహాలింగన. ఆస్ట్రియన్ చైనీస్ యువతులు

ఒకరితో మరొకరు పోరాడుకోగూడదు! శాంతి—
'సర్వదా శాంతి వర్ధిల్లాలి?" అన్న మాటలను అం
దరూ పలికారు.

"మనకెన్నో ఒకేవిధమైన సమస్యలున్నాయి" అంటున్నారు భారతదేశంనుంచివచ్చిన, ఉపాధ్యాయిని సుజాతజోరీ. సోవియట్ ఉపాధ్యాయిని ఎం. సైతనెన్కోతో





అమృత కరస్పర్శ!

# ...సమ్మేళనంలో...

నాకూ ఇష్టంలేదు. అయితే మనిద్దరం స్నేహితులం, నువ్వూ నేను. రా, మనం ఒకరి బ్యాడ్జిలు మరొకరికి ఇచ్చుకొందాము. నా దగ్గర వున్న సంతకాల పుస్తకంలో నీపేరు వ్రాయడం మరిచిపోవుగదూ.

పాకిస్తాన్ నుంచా? సలామ్! భారతదేశం నుంచి వచ్చాను నేను. నిన్న మొన్నటివరకు మనం సోదరులం కాదా? ఇప్పుడుకూడా మనం సోదరులమే! దగ్గరికి రా తమ్ముడూ!

మాస్కో వీధులలో



నువ్వు అమెరికన్ దేశస్థుడవా? నేను రష్యన్ దేశస్థుడను. కమ్యూనిజం అంటే నీ కిష్టంలేదూ? సరే. పెట్టుబడిదారి విధానమంటే నాకూ ఇష్టంలేదు. ఐతేమాత్రం ఏం? ఇద్దరం శాంతితో జీవించాలని ఆశిస్తాము. అవునా కాదా? అసలు కావలసిందదే!

నువ్వెక్కడ్నుంచొచ్చావు? బ్రిటన్‌నుంచా? నేను ఓమన్ నుంచి వచ్చాను. మా మీద బాంబులు వేయడానికి మీ ప్రభుత్వం విమానాలను పంపిస్తున్నది. కాని నిజంగానే అది నీకిష్టం లేదుకదూ? అది

చేవ్రాళ్ళ సేకరించేవారిలో పేరుకెక్కారు భారతీయులు →



ఒకరినొకరు అర్థం చేసుకొందాము!

సగర్వంగా తల పైకెత్తిచూస్తున్న, ఆఫ్రికన్ మిత్రుడు! ఇప్పుడు నువ్వు నీమిత్రుల సమక్షంలో వున్నావు. నీ వర్ణం నలుపుగా వున్నదని, నిన్ను తక్కువవాన్నిగా పరిగణించే వారెవ్వరూ లేరు. ఇదుగో, నాచేతితో నీచేయి కలుపు!

అందరం చేతులు కలుపుదాము! ఈచేతులే, నల్లని, తెల్లని, పసుపుపచ్చ, గోధుమ వర్ణపు యీ మన చేతులే భవిష్యత్తును నిర్ణయించి, ప్రపంచ భావిని రూపొందిస్తాయి!

సంతతం పెట్టడం, వ్యాప్తి పెట్టడం ఒకేసారి జరుగుతుంది



# మహోత్సవ దినచర్య

(౩వ పుట తరువాయి)

మంటే ఇలాగుండాలి!" ప్రపంచ నలుమూలలనుండి వచ్చిన యువక రాయబారులకు మాస్కోవాసులు ఇలా హృదయ పూర్వక స్వాగత మిస్తుడడం చూచి నేను గర్వపడ్డాను!.......

చివరికి గడియారం మూడుగంటలు కొట్టింది. ఊరేగింపు ముందుభాగం కనబడసాగింది. ఇక యేదీ స్పష్టంగా వినబడడం లేదు. లక్షమంది ప్రజలు ఉత్సాహాతిశయంతో కేకలు వేస్తుంటే నెలాగుం టుందో ఆలోచించుకోండి!

అబ్బ, యేమిదృశ్యం! వివిధ రంగుల పతాకాల సముద్రం స్టేడియంలోకి ప్రవహించసాగింది. ఐదు ఖండాల దేశాలు, వర్ణమాలానుక్రమంలో, ఒకటి తర్వాత ఒకటిగా స్టేడియంలోకి అడుగిడుతున్నాయి.

ఈ లెనిన్ స్టేడియంకు ప్రతివారు, తమతోపాటు తమ దేశీయ సంప్రదాయాలను, ఆచారాలను, దుస్తులను, పాటలను తెచ్చుకొన్నారు. గనులలో పనిచేసే బ్రిటిష్ పౌరుడు బంగారు జలతారు కుట్టిన నల్ల దుస్తులను వేసుకున్నాడు. ఆఫ్రికానుండి వచ్చిన

(మిగత ౯వ పుట చూడుడు)



నగరవీధిలోని ఒకదృశ్యం



# పునస్సమాగమం

ఉత్సవం ప్రారంభం కావడానికి కొంత కాలం ముందు జూలియన్నీ కారో అనే ఒక ఫ్రెంచి గని కార్మికుని భార్య వ్రాసిన ఉత్తరం కోమ్సొమోల్స్కాయా ప్రవదా పత్రికలో ప్రకటింపబడింది. ఆమె ఒక అసాధారణమయిన కోర్కెను కోరింది. ఉత్సవానికి ప్రతినిధి గావస్తున్న తన కుమార్తె సిమోనీకి గోర్కీ నగరంలోవున్న మిఖెయిల్ పోలిస్కాలోవ్‌ను కలుసుకొనే అవకాశం కల్పించమని అడిగింది. ఆమె అలా అడగడానికి కారణం ఇది

రెండవ ప్రపంచ యుద్ధం కొనసాగుతోంది.... ఫాసిస్టులు సోవియట్ ఖైదీలను ఫ్రాన్సులోని లొరెయ్న్ మండలంలో వున్న ఒక శిబిరంలోకి తోలి గనులలో పని చేయించసాగారు. ఫ్రెంచి గనికార్మికులు తమ ప్రాణాలను కూడా తెగించి, తమ సోవియట్ మిత్రులకు సహాయం చేశారు.

జూలియన్నీ కారో భర్త ముగ్గురు రష్యన్లు తప్పించుకు పారిపోడానికి సహాయం చేశాడు. వాళ్ళతోపాటే వెళ్ళి ప్రతిఘటనోద్యమంలో చేరాడు. ఫాసిజం ఓడింపబడిన తర్వాత అతడు తిరిగి ఇంటికి వెళ్ళిపోయాడు. తీవ్రంగా గాయపడిన మిఖెయిల్ పొలిస్కాలోవ్ అనే ఒక రష్యన్ యువకుడుగూడా అతనితోపాటు ఇంటికి వచ్చాడు.

"ఆ యువకుడు చాలా నెలలపాటు మా యింట్లో ఉన్నాడు," అంటూ జూలియన్నీ వ్రాసింది. "అతనిని మేము సోదరుని ప్రేమించినట్టు ప్రేమించసాగాము. అతడు చూచినప్పటికి చిన్న పిల్లగా వున్న మా అమ్మాయి ఉత్సవానికి వస్తున్నది. ఆమె మా రష్యన్ మిత్రుని, లేకపోతే అతని కుటుంబంలోని వారి నెవరినైనా కలుసుకోవాలని మేము అభిలషిస్తున్నాము. ."

ఈ సమావేశం యేర్పాటు చేయబడింది. వాళ్ళు కలుసుకొన్నప్పుడు ఇద్దరి కండ్లల్లో నీళ్ళు తిరిగాయి.

తాను చూచేటప్పటికి బొమ్మను చంకలో పెట్టుకొని ఆడుకొంటున్న ఆ బాలిక, 16 సంవత్సరాల సౌందర్యవతిగా తయారయ్యిందంటే మిఖెయిల్ తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. అప్పుడు బొమ్మనుపట్టుకు ఆడుకొంటూ వుండిన పిల్ల ఇప్పుడు బొమ్మల ఫ్యాక్టరీలో పని చేస్తోంది.

"మీ నాన్నా, అమ్మా యెలాగున్నారు ?"

"బాగానే ఉన్నారు. నాన్న అదే గనిలో పని చేస్తున్నారు. మిమ్మల్ని గురించి అన్ని వివరాలు తెలుసుకొని రమ్మని చెప్పింది. అమ్మ. ఫ్రాన్సునుండి బయలు దేరేటప్పటికి మీ ఆరోగ్యం చాలా చెడిపోయి వున్నది."

"అవును, ఎన్నో హాస్పటళ్ళు తిరిగినాక నా ఆరోగ్యం బాగుపడేటప్పటికి ఎంతో కాలం పట్టింది. అటుతర్వాత నేను తిరిగివచ్చి పనిలో చేరాను. మా ఫ్యాక్టరీ యేమంత పెద్దది కాదు. అయినా అది, కత్తులు, ఫోర్కులలాంటి ఉపయోగకరమయిన వస్తువులను తయారు చేస్తుంది.

"ఇదుగో, మా ఫ్యాక్టరీలో తయారు చేసిన కత్తులు, ఫోర్కులు. వీటిని మీ తలిదండ్రులకు నా బహుమానంగా ఇవ్వు. భోజనానికి కూర్చునప్పుడు నేనూ, మీ సోవియట్ మిత్రులూ గుర్తుకు వస్తుంటాము."

"మా ఇంట్లో యెవ్వరమూ వాళ్ళను మరిచిపోలేము", అన్నది సైమెనీ.

"నేను గూడా మీ యింటినీ, మీ కుటుంబాన్నీ యెన్నటికీ మరిచిపోలేను. నాకెప్పుడూ మీరు సన్నిహితంగానే ఉంటారు."

ఇలా వీళ్ళు కలుసుకొన్న దృశ్యం చూచిన వాళ్ళందరికీ యుద్ధానికి సంబంధించిన విషయాలు ఒకసారి గుర్తుకు వచ్చాయి. రక్తపాతం, అశ్రుధారలలో మైత్రి యెలా యేర్పడిందో వారికి ఒకసారి స్ఫురించింది. అదే శాంతికి ఒక గ్యారంటీ అని వారికి అర్థమయింది.

## ఉత్సవంలో పాల్గొన్న పాప

టునీషియాకు చెందిన చిత్రకారుడు ఎ. జియోర్జీ, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయిని అయిన అతని భార్య రెదియా ఎలాగైనా సరే ఉత్సవానికి హాజరు కావాలని నిశ్చయించుకొన్నారు. వారు బయలు దేరడానికికొద్ది రోజుల ముందు రెదియాకు మగ శిశువు కలిగాడు. ఏం చెయ్యడం ! అందరూ కలిసి వెళ్ళాలనే నిర్ణయింపబడింది.

ఉత్సవంలో పాల్గొన్న అందరికంటే చిన్నవాడైన ఈ పాప హోటల్‌లో గాక, మాస్కోలోని ఒక శిశు గృహంలో ఉన్నాడు. అతిచిన్నవాడైన యీ మిత్రుని అభినందించడానికి రష్యన్లు, డచ్‌వారు, అమెరికన్లు, ఇండోనీషియన్లు, ఇతర దేశాలవారు ఎప్పుడూ వస్తుండేవారు !

# హిరోషిమా ఘటనది మరివొద్దు!



ఈ సమావేశంలో ఉపన్యసిస్తున్న హిసాకో నగాటా, తమ స్వస్థలం నాగసాకీమీద అణుబాంబు ప్రయోగం జరిగినప్పుడు 10 ఏళ్ళ బాలిక

మాస్కోలోని సువిశాలమైన మనెజ్ చౌకు లోకి ప్రతినిధివర్గ బారులు ప్రవేశించాయి. అది ఆగస్టు 7—హిరోషిమా విషాదఘటన పన్నెండవ వార్షికము. వారి ముఖాలు గంభీరంగా వున్నాయి. పిడికిళ్ళు బిగిసాయి. అణు యుద్ధం "వల్లకాదు" అంటూ పోస్టర్లు ప్రకటిస్తున్నాయి. పెనుగాలిలో వివిధ దేశాల పతాకాలు రెపరెప లాడాయి.

మండుతున్న కాగడాలు, నగారాలమ్రోత, సన్నగాపడుతున్న ఫ్లచ్ లైట్ల వెలుతురు, చౌకులోని చిరుచీకటి గతించిన యుద్ధ సంవత్సరాలను స్ఫురణకు తెస్తున్నాయి. చౌకులో బీతోవన్ యొక్క పంచమ స్వరం గంభీరముగా వినబడుతోంది.

ఫ్లచ్ లైట్ల వెలుగు "హిరోషిమా శిల"పై పడింది. ఒక మానవుని నీడ దానిపై అగుపడింది. అణుయుద్ధ మారణ హోమానికి గురియైన ఒకనగరం బాలుకు మిగిలిన దిదొక్కటే. నటాషా జిన్యలియా అనే ఒక 9 సంవత్సరాల మాస్కోబాలిక ఆ రాతిపైన పూలను వుంచి, ఒక బ్రహ్మాండమయిన "స్నేహపు కాగడా"ను వెలిగించింది.

తన స్వస్థలమయిననాగసాకీపైన అణుబాంబు వేయబడినప్పుడు పది సంవత్సరాల వయస్సు పిల్లగా వుండిన హిసాకో నగాటా ఉపన్యసిస్తూతనయావన్మంది బంధువులనూ తలిదండ్రులను ఎలాగోల్పోయిందీ తెలియజేసింది.

"ప్రపంచం నలుమూలలనుండి వచ్చిన మిత్రులారా! హిరోషిమా, నాగసాకీ దుర్ఘటనల లాంటివి తిరిగి సంభవించకుండా ఉండేందుకు, సమస్త యువజనులకు ఆనందదాయక జీవితము, తేజోవంతమైన భవిష్యత్తు చేకూరేందుకు మనమందరము ఏకమౌదాము!" అన్నది, హిసాకో.

ఒక నిముషంపాటు మౌనంగా వుండి, అణుబాంబులకు గురియైన వారిపట్ల గౌరవాన్ని ప్రకటించమని హిసాకో కోరింది. వేలాది జనం తలలువంచుకొని నిలబడ్డారు.

ఎడ్వర్డ్ యంగ్ అనే ఒక యువక ఇంజినీరు ఇలా అన్నాడు: "హిరోషిమా భయంకర ఘటనలు తిరిగి జరుగకుండా చూడవలసిన బాధ్యత మానవాళిపట్ల మనకున్నది."

ప్రపంచ శాంతి సమితి ఉపాధ్యక్షుడు జేమ్సు ఎన్డికట్ సమావేశమయిన వారిని ఉద్దేశిస్తూ ఇలా ఉద్ఘాటించాడు: "సుసంఘటితమయిన ప్రజా ఉద్యమము, పోరాటములేనిదే మనం శాంతిని సాధించి, హిరోషిమా దుర్ఘటనలను అరికట్టలేము. అందువల్లనే మేము, అందరు ప్రజలూ అణ్వాయుధ పాటవపరీక్షల నిలుపుదలనూ, అణ్వాయుధ నిలువల నిర్మూలననూ కోరుతూ, నిరాయుధీకరణ ద్వారా శాంతిని పరిరక్షించమని విజ్ఞప్తి చేస్తున్నాము. ఈ మహోత్సవపు ఉల్లాసాలనూ, మైత్రిని రుచిచూచిన యువజనులు యీ విజ్ఞప్తిని ప్రపంచం నలుమూలల ఉన్న ప్రజలకు అందజేస్తారని మేము నమ్ముతున్నాము."

జపాన్ ప్రతినిధివర్గ నాయకుడు సుసమో సానో వేదికపైకి వచ్చాడు.

"హిరోషిమా, నాగసాకీలలో అణ్వాయుధ ఫలితాలను అనుభవించిన మేము, అణు, ఉదజని ఆయుధాల సంపూర్ణనిషేధానికి విజయవంతమయిన ఒడంబడిక చేసుకునేందుకు సాధ్యమయినదంతా చేయమని సమస్త దేశాల ప్రభుత్వాలనూ, మిత్రరాజ్యసమితినీ, దాని సంఘాలనూ కోరమని మా యువక మిత్రులకు విజ్ఞప్తి చేస్తున్నాము."

ఒక చిన్న బాలిక సభావేదికమీదికి వచ్చినది. ఆమె ఒక తెల్లని పావురాన్ని విడిచి పెట్టింది. వేలాది జనం తమతమ భాషలలో ప్రపంచ యువజన గీతాన్ని పాడారు.

హిరోషిమా సంస్మరణ దినోత్సవ సమావేశానికి మనెజ్ చౌకుకు 5 లక్షలకు పైగా ప్రజలు విచ్చేశారు





# స్వాతంత్ర్య గీతాలు



ఒక విద్యార్థి సమావేశం దగ్గర (ఎడమనుంచి కుడికి) మహమ్మద్ ఆలీ ఖలీప్ (ఈజిప్టు) అబ్బట్ ఇజాట్, మనసట్ మిషెల్ (జోర్డాన్), సాలేమోస్సా (ఈజిప్టు), కిమ్‌డెన్‌సూక్ (కొరియా). డినాబర్నక్ (బ్రెజిల్), విక్రమసింగ్ విల్‌ఫోర్డ్ (సిలోన్).

"ప్రియ మిత్రులారా, నేటి మన చర్చావిషయం, సహకారం, ఆఫ్రికా దేశాల యువజనులమధ్య పరస్పర అంగీకారం అన్నారు," ఆఫ్రికా దేశాల యువజనుల సమావేశా న్ని ప్రారంభిస్తూ మహమ్మద్ ఇజ్నాద్. "సువిశాలమైన యీ అంతర్జాతీయ సమావేశ మందిరపు పడసాలలో మన స్నేహ సంబంధాలను ఎట్లా విస్తృతీకరించుకోవాలనే విషయాన్ని చర్చించుకోవడానికి మన మందరమూ సమావేశం కాగలిగినందుకు మనకెంతో ఉత్సాహంగా వుంది."

ఉపన్యాసకులలో చాలామంది, జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో ఆఫ్రికా ప్రజల కర్తవ్యాన్ని గురించీ, స్వేచ్ఛా, సాంస్కృతిక వికాసాల గురించీ, క్లుప్తంగా ప్రసంగించారు. శతాబ్దాల తరబడి వలసదాస్య భారంతో క్రుంగిపోతున్న ఆఫ్రికా ఖండం మేల్కొని, తమ పురాతనపు మహత్తర జాతీయ సాంస్కృతిక సంపదలను సుసంపన్నం చేసుకొనే అవకాశాన్ని ఆఫ్రికా ప్రజలకు కల్పించవలసిన సమయం ఆసన్నమైనదని ప్రతినిధులందరూ ఉద్ఘాటించారు. సమాన జాతుల మిత్రకుటుంబంలో సముచితస్థానాన్ని సముపార్జించుకోవడానికి, గాలిలాగే వారికి కావలసింది శాంతి, స్వేచ్ఛ, జాతీయ స్వాతంత్ర్యం.

"ఒక దేశాన్ని విదేశస్థులు దాడిచేస్తే," అంగోలావాసి (పోర్చుగీసు ఆఫ్రికా మేరియో పిన్టో డి ఆంద్రెడీ, "ఆ దేశపు సంస్కృతి క్రమంగా నశిస్తుంది. కేవలం స్వాతంత్ర్యం, సమానతల వల్లనే సాంస్కృతిక, ఆర్థిక సంబంధాలను పటిష్ఠం చెయ్యవచ్చు." అన్నారు.

మొజాంబిక్‌నుంచి వచ్చిన ఒక యువకుడు "మన పాటలే స్వాతంత్ర్య గీతాలు" అన్నాడు.

## ఆఫ్రికా ఆసియా యువజన సమావేశాలు

ఆఫ్రికా, ఆసియా దేశ యువజన ప్రాంతీయ సమావేశం, పోలీటెక్నికల్ ప్రదర్శనాలయపు ఒక గదిలో జరుపబడింది. ఈ సమావేశం ఈజిప్ట్ ప్రతినిధి వర్గనాయకుడు, డాక్టర్ అబ్దెల్ తహర్ ప్రారంభించారు.

"1954, ఏప్రిల్లో జరిగిన చారిత్రాత్మక బాండుంగ్ మహాసభ, ప్రపంచశాంతికి ఒక మహార్థాన్ని ప్రతిపాదిస్తున్న దనుటలో సందేహంలేదు," అన్నారొక ప్రతినిధి.

శ్రీ తెహాచ్, ఈజిప్టు ప్రతినిధివర్గ పక్షాన ఇట్లా ప్రతిపాదించారు :

1. 1958లో, జపాన్లో, బాండుంగ్ మహాసభలో పాల్గొన్న దేశాల యువజనవర్గాల సమావేశం జరపాలి.

2. ఆసియాలోని ఏదేశంలోనైనా సరే విద్యాభ్యాసం చేస్తోన్న యువజనులకు సాయపడాలి.

3. పుస్తకాలు, ఫిల్ములు ఇచ్చిపుచ్చుకోవడానికి, స్నేహపూర్వక పర్యటనల ఏర్పాటు చేయడానికి ఒక వ్యవస్థను రూపొందించాలి.

4. క్రీడాకారుల ప్రతినిధివర్గాలను పరస్పరం ఆహ్వానించడం.

5. ఈ నిర్ణయాలను ఆచరణలోకి తీసుకరావడానికి, బాండుంగ్ మహాసభలో పాల్గొన్న దేశాల యువజన సంస్థను సుస్థిరంగా నెలకొల్పడం.

## మహోత్సవ దినచర్య

(8వ పుట తరువాయి)

నల్లయువతీయువకులు ఊహింపశక్యం కానంతటి అందమైన దుస్తులను వేసుకొని ఉన్నారు. గాలికి అవి యెంతో మనోహరంగా రెపలాడుతున్నాయి. సిప్రస్ దేశీయులు జలతారు కుట్టినసల్లటి పట్లాంలు వేసుకొన్నారు. ఈజిప్ట్ దేశపు యువతులు ఊదారంగు,పసుపుపచ్చ రంగు లంగాలను ధరించారు. చేతుల్లోవున్న కంజరులను వాయిస్తున్నారు....

మధ్యనున్న ఖాళీస్థలం నిండిపోయింది. పుష్పాలు, రంగు రంగు దుస్తులు ధరించిన యువజనులు ఏకమై మనోహర దృశ్యం అగుపడుతున్నది. ఆలాంటి దృశ్యాన్ని మాటలలో వర్ణించడం అసాధ్యం. "ప్రాచీన మాస్కోనగరానికి, మా దేశానికి వసంతఋతువు రెండవసారి వచ్చింది." సోవియట్ ప్రభుత్వంతరపున, ఉత్సవంలో పాల్గొన్నవారిని అభినందిస్తూ ఈ మాటలను అన్న అధ్యక్షుడు వొరొషిలోవ్ మా అందరి మనస్సులలో వున్న విషయాన్నే వెల్లడించారు.

(మిగత 13వ పుట చూడుడు)



కిర్గీజియానుంచి వచ్చిన ప్రతినిధులు నుర్బిన్ కొల్యకోవ్, తెర్సున్ షముర్జేవ్, బ్లాక్ ఆఫ్రికా ప్రతినిధితో ముచ్చటిస్తోన్న దృశ్యం



# భారతదేశం నుంచి వారు వచ్చారు



మా ప్రత్యేక విలేఖరి

భారతీయుల ఒకజట్టును స్టేషన్ నుండి హోటలుకు తీసుకువెళ్ళినబస్సులో నేను వున్నాను. మేము గోర్కీ వీధికి చేరుకొనేటప్పటికి మాస్కోవాసులు గుంపులు గుంపులుగా రోడ్డుప్రక్కన కూడడం కనుపించింది. వారు చేతులు ఊపుతూ హర్షధ్వానాలుచేస్తూ "హిందీ-రూసీ భాయ్, భాయ్!" అని కేకలువేయ సాగారు, బస్సులో వున్న భారతీయుల్ని చూడడంతోటే.

"హిందీ-రూసీ, భాయ్ భాయ్!" అన్న నినాదం భారతీయులు యెప్పుడు కనబడ్డా, యెక్కడ కనబడ్డా నాకు వినబడుతూ వచ్చింది.

ఉత్సవ ప్రారంభ దినంనాడు ఓస్టాన్‌కినో హోటల్ నుండి లెనిన్ స్టేడియంవరకు వున్న మార్గమంతా బారుయితీరి నిలచి వున్న మాస్కోవాసులు భారతీయులు వున్న ట్రక్కు దగ్గరకు బారులు విడిచి పరుగెత్తు తుండేవారు. భారతీయులతో కరచాలనం చేయడానికి ఒకరి నొకరు తోసుకుంటూ ట్రక్కు దగ్గరకు ఉరికేవారు. "హిందీ-రూసీ భాయ్, భాయ్!" అను నినాదం సదా మారుమ్రోగుతూ వుండేది.

భారతీయ గాయక బృందం తమ కార్యక్రమం ఆఖరులో "హిందీ-రూసీ భాయ్, భాయ్" పాటను పాడడానికి వేదికమీదికి వచ్చి నప్పుడు ప్రేక్షకులు యావన్మంది లేచి నిలబడడం నేను చూచాను. సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనంలోని బహిరంగ నాటకశాలలో మొట్టమొదటిసారిగా జరిగిన భారతీయ కళా ప్రదర్శనానికి హాజరైన ఆ 4,000 మంది ప్రజలు చప్పట్లు చరచడము. "హిందీ-రూసీ భాయ్, భాయ్"అని నినాదాలు చేయడము ఎప్పటికీ ఆగదా ఏమటనిపించింది.

ఈ సుస్వాగతాన్ని చూచి భారతీయ ప్రతినిధులు యేమను కొంటున్నారా, అని నేను ఆశ్చర్య పడసాగాను.

భారతీయ కళాకారులు వఖ్తాన్గోవ్ నాటకశాలలో ఒక ప్రదర్శన ఇచ్చి తర్వాత గుర్జర్ గార్బా మండల్ జట్టు నాయకులలో ఒకడైన గౌతమ్ జోషిచుట్టు పెద్దగుంపు కూడి వుండడం నేను చూచాను. మాస్కో చూపిన ఆతిథ్యం తమ నెంతగానో ఆకర్షించిందని ఆయన అన్నాడు. ఉత్సాహాతిశయంతో ఆయన, "ఇక్కడ మాకు ఇవ్వబడిన



ఒక సోవియట్ ప్రదర్శనానంతరం, భారత ప్రతినిధులు సోవియట్ కళాకారులను అభినందిస్తోన్న దృశ్యం (పైన)



ఆ పుస్తకంలోని చేవ్రాలు, యీ సోవియట్ వనితకు విభూర భారత దేశం నుంచి వచ్చిన ఆ స్నేహితురాలిని ఎప్పుడూ జ్ఞాపకం చేస్తూంటుంది(మధ్య)



ఈ భారత యువతి తన చైనా, మంగోలియన్ స్నేహితురాండ్రతో ఎంతో సన్నిహితంగా వున్నట్టుంది! (దిగువ)

కార్మికసంఘాల భవనం, "హాల్ ఆఫ్ కాలమ్స్"లో, ప్రాచ్యనృత్య, జానపద నృత్య ఉత్తమ ప్రదర్శన పోటీలో నృత్య ప్రదర్శన నిస్తున్న భారతీయయువజన బృదం ↓







అతిథ్యాన్ని వర్ణించడానికి నాకు మాటలు చాలడం లేదు," అన్నాడు.

భారతీయ ప్రతినిధివర్గం బసచేసిన హోటల్‌లో నేను కలుసు కొన్న సుధాకర్ భట్ అనే పత్రికా రచయిత ఇలా అన్నాడు: "మేము ఎక్కడెక్కడికి—క్రెమ్లిన్‌కు, లెనిన్ లైబ్రరీకి, అద్భుతమైన మీ మెట్రోకు —వెళ్ళినా మమ్మల్ని సోదరులను చూచినట్లు చూచారు. వారు చూపిన ఆదరణ మమ్మల్ని తన్మయుల్ని చేసింది. మాస్కోవాసుల్ని మేముకూడా అదే ప్రేమ వాత్సల్యాలతో చూస్తాము."

## విస్తృతమైన ప్రాతినిధ్యం

భారతీయ ప్రతినిధివర్గం ఉత్సవానికి వచ్చిన ప్రతినిధివర్గాలలో అతివిస్తృతమైన ప్రాతినిధ్యంగల ప్రతినిధివర్గమని నాకు అనుపించింది. వివిధ వృత్తులకు చెందినవారూ, వివిధ రాష్ట్రాలనుండి వచ్చిన భిన్న రాజకీయాభిప్రాయాలు, మత నమ్మకాలు గలవారు ఆ ప్రతినిధి వర్గంలో ఉన్నారు. ఉత్సవం వారిని ఒక చోట సమకూర్చింది. ఉత్సవంపట్ల తమ వైఖరి విషయంలో ఏకమయ్యారు.

పదిమంది ప్రతినిధులను పర్యవేక్షకులుగా పంపిన భారత విద్యార్థుల జాతీయ సంఘం అధ్యక్షుడు మనోహర్‌రావ్, ఎం. ఎ., ఆ విషయాన్ని చక్కగా ఇలా ప్రకటించాడు "ఈ ఉత్సవం మాకూ, తదితరదేశాల యువజనులకూ ఒకరినొకరు కలుసుకోడానికి చక్కని అవకాశాన్ని కల్పించింది. శాంతిని పరిరక్షించి, పటిష్ఠంచేయడానికి తోడ్పడే శాశ్వత స్నేహబాంధవ్యాలను సృష్టించడానికి దోహదమిస్తుంది."

"ఈ ఉత్సవంవల్ల మీ సంఘం పొందిన లాభమేమిటి ?" అని నా సహచరుల్లో ఒకరు అడిగారు.

ఇతర దేశాలనుండి వచ్చిన విద్యార్థులతో మాసంఘం సంబంధాలను బలపర్చుకొన్నది.

## మైత్రి పెంపొందుతోంది

ఒక భారతీయ మిత్రుడన్నట్లు, వారు పొందిన గొప్పలాభాల్లో ఒకటేమిటంటే, మాస్కోను సందర్శించి సోవియట్ జీవితపు

(మిగత 36వ పుట చూడుడు)

భారతీయ ప్రతినిధులు మాస్కోకు పోతూ, మార్గమధ్యాన ఉజ్బెకిస్తాన్లో ఆగి స్టాలిన్ సమిష్టి క్షేత్రాన్ని సందర్శించారు ↓





సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనాలయ బహిరంగ నాటకశాలలో జరిగిన అంతర్జాతీయ ప్రదర్శనలలో ప్రదర్శించబడుతోన్న భారతీయ నృత్య కార్యక్రమ దృశ్యం →

మాస్కో హిప్పోడ్రోమ్ దగ్గర ఒక ఆశ్విక ప్రదర్శనానంతరం, భారతీయ, సోవియట్ క్రీడాకారులు కరచాలన చేసుకుంటోన్న దృశ్యం →







సోవియట్ యువగాయం బృందం, "అభినందనలు మా స్నేహితులకు" అనే నొవికోవ్ గీతాన్ని ఆలాపిస్తున్నారు

# సోవియట్ సాంస్కృతిక ప్రదర్శన

ప్రపంచ యువజనోత్సవాలు మహత్తరమయిన సంస్కృతి ఉత్సవాలుగాకూడా ప్రఖ్యాతి గాంచాయి. పెద్ద యెత్తున, అధిక కార్యక్రమాలతోనూ జరగడంలో మాస్కోలో జరిగిన ఉత్సవం అంతకుపూర్వపు ఉత్సవాలనన్నింటిని తల దన్నింది. వివిధ దేశాలనుండి వచ్చినయువజన ప్రతినిధివర్గాలు ఉత్సవానికి అత్యంత ప్రతిభావంతులైన యువజనుల జట్లను తీసుకువచ్చాయి. ఈజట్లు చక్కని తమతమ జాతీయసాంస్కృతిక ప్రదర్శనలను ఇచ్చాయి.

ఈ సమయంలో 670 సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి. కళాకారుల జట్లు 47 జాతీయ సాంస్కృతికప్రదర్శనల నిచ్చాయి. 71 అంతర్జాతీయ కళా ప్రదర్శనలు, 397 జాతీయ కళా ప్రదర్శనలు, 88 సర్కస్ ప్రదర్శనలు, 67 ఇతర ప్రదర్శనలు, నాటకాలు, కీలుబొమ్మలాటలూ జరిగాయి.

ఉత్సవంలో పాల్గొన్న సోవియట్ ప్రతినిధివర్గం సోవియట్ సైనిక నాటక శాలలో ఒక చక్కని కళాప్రదర్శన నిచ్చింది. నోవికోవ్ వ్రాసిన "మామిత్రులకు అభినందనలు" అన్న పాటతో కార్యక్రమం ప్రారంభమయింది. సోవియట్ దేశం యొక్క పదిహేను రిపబ్లిక్‌ల యువతీ యువకులు దానిని పాడారు.

దాని తర్వాత సైబీరియా ఉక్రెయిన్, ఇస్తోనియా, ఉజ్బెకిస్తాన్ యువజనుల ప్రదర్శనలు, లెనిన్‌గ్రాడ్ గేయనాటకశాలకు చెందిన సోలో పాటకులు ఎ. ఒసిపెంకో, ఎ. గ్రిబోవ్‌ల సంగీతము జరిగాయి. వీటి తర్వాత కిర్ఘిజియాకు చెందిన కొముజా ప్రదర్శన జరిగింది. కీవ్ సంగీత విద్యాశాల విద్యార్థి, సోవియట్ జాతీయ యువజనోత్సవంలో బహుమతీగ్రహీత అయిన ఎ. కికాత్ పాట విన్నప్పుడు హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. అతడు ఒక జానపద గేయాన్నిపాడాడు. బోల్షాయ్ నాటకశాలకు చెందిన సోలో పాటకురాలు ఎన్. తిమెఫీవా పాటకుగూడా ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.



స్టానిస్లవెస్కీ ప్రదర్శనాలయంవద్ద, అర్జెంటైన్ యువజనులు ప్రదర్శించిన ఐ. అపచ్కా నాటకం "దేవిగారి నింద"లోని ఒక దృశ్యం

★



మనెష్ చౌకులో జరుగుతోన్న రష్యన్ నృత్య దృశ్యం

కజఖ్ సంగీత, నాట్యబృందం ఇచ్చిన "సైహాత్తా" (విశ్రాంతి) అనే నృత్యం చూచి అతిథేయులు, అతిథులుకూడా ఆనందపరవశు లయ్యారు.

సోవియట్ ప్రజల ప్రతిభా విశేషాలను ప్రదర్శిస్తున్న ఈ కార్యక్రమంలో బాష్కిర్ రిపబ్లిక్ సంగీత బృందం యొక్క ప్రాప్త మైన సంగీతము, గదక్ అనే ఒక తుర్క్‌మెన్ జానపద వాద్యంమీద చైకొవస్కీ పాడిన శాస్త్రీయ సంగీత గేయాలు, లెనిన్ గ్రాడ్ కార్మిక రిజర్వు రుస్లాన్. లూడ్మిల్లాలపైన పాడినపాటలు వుండినవి.

కార్యక్రమంలో ఏది గొప్పగా ఉన్నదని ఎంచి చెప్పడం కష్టం, అన్నాడు చైనా యువజన జట్టు నాయకుడు చౌ వి.షి. ప్రతి ఒక్క అంశం అందంగా, ఆసక్తిదాయకంగా, అత్యున్నత స్థాయికి చెందినదిగా ఉన్నది.

## మహోత్సవ దినచర్య

(9వ పుట తరువాయి)

రెండురోజులు గడిచిపోయాయి. ఈ రెండురోజులూనేను డైరీ వ్రాయలేకపోయాను. డైరీ వ్రాయడానికి స్థిమితంగా కూర్చో డానికి వీలేదీ, యావత్ప్రపంచము వచ్చి క్షణక్షణం నీఇంటి తలుపు తడుతున్నప్పుడు

చేయవలసిందీ, చూడవలసిందీ ఎంతో ఉన్నది. ఎడతెరిపి లేకుండా కొనసాగుతున్న సుందరమైనకలల కార్నివాల్‌లాగ ఉన్నది ఉత్సవం. ఒక వినోదంచూచి, బయటికి రాగానే మరొకటి ఎదు రవుతున్నది. కానిఅసలు తమాషా అంతా వీధుల్లోనే వున్నది.మాస్కో వీధుల్లో ఒక అసాధారణమైన మహోత్సవ వాతావరణం వెల్లివిరు స్తోంది. పగటిపూట ఎక్కడచూచినా ప్రజలు గుంపులు గుంపులుగా అగుపడుతున్నారు. ఎవరో ఒక అతిధిచుట్టూ చేరినవాళ్లన్న మాట వాళ్ళంతా. వాళ్ళ సంతకాలు తీసుకొంటున్నారు. అడ్రసు వ్రాసు కొంటున్నారు. వాళ్ళ బ్యాడ్జిలు అడిగితీసుకొని వాళ్ళకు తమ బ్యాడ్జిలు ఇస్తున్నారు. ఎన్నెన్నో ప్రశ్నలు అడుగుతున్నారు. కరచాలనం

(మిగత 15వ పుట చూడుడు)

## భారత దేశ సాంస్కృతిక ప్రదర్శనం

భారతదేశపు జాతీయ సాంస్కృతిక ప్రదర్శన జూలై 29వ తేదీన వ్యవసాయ ప్రదర్శనం బహిరంగ నాటకశాలలో జరిగింది. ఆఫ్రికా దేశీయులు, ఇంగ్లీషువారు, నార్వేజియన్లు, డేన్లు, స్వీడన్ దేశీయులు, ఫ్రెంచివారు, చైనీయులు, ఇటాలియన్లతో కూడిన నాలుగు వేలమంది ప్రేక్షకులు హాజరయ్యారు.

సోవియట్ దేశంలో అందరికీ పరిచయమైన ఇక్బాల్ పాటతో కార్యక్రమం ప్రారంభమయింది. ఈ పాట తరుచు రేడియోనుండి హిందీ భాషలో ప్రసారం చేయబడుతుంది. రషీద్ బెయ్‌బుతోవ్ అనేక ప్రదర్శనలలో దీనిని పాడుతుంటాడు. "నా ప్రియమైన భారత దేశం" అన్న ఈ పాటకు రవిశంకర్ స్వరకల్పన చేశారు.

శ్యామ్ సుందర్ నాయకత్వంలో బొంబాయినుండి వచ్చిన బృందం చేసిన నృత్యం కార్యక్రమంలోని రెండవ అంశం, వారి "భిల్" నృత్యం, ముఖ్యంగా "మయూర నృత్యం" ప్రేక్షకులను విస్మయులను చేసినవి.

గోపీనాథ్ ప్రముఖ శిష్యురాలు పద్మిని కథక్‌శైలి శాస్త్రీయ నృత్యాన్ని అద్భుతంగా ప్రదర్శించింది. రెండవ భాగంలో ఆమె, ఆమె చెల్లెలు రాగిణి అతిక్లిష్టమైన ఒక నృత్యాన్నిచేశారు, ప్రేక్షకుల హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. అనేకమంది వారి ఛాయాచిత్రాలను తీసుకొన్నారు.

అంత్యంలో. చక్కగా పాడబడిన "హిందీ-రూసీ భాయ్, భాయ్" పాట విన్న ప్రేక్షకుల హావభావాలను గురించి తెలుపవలసి వుంటుంది. లండన్ నుంచి వచ్చిన ఒక భారతీయ విద్యార్థులబృందం దీనినిపాడింది. పాట ముగించేటప్పటికి ప్రేక్షకుల ఆనందం వెల్లివిరిసింది. "భారతీయులు, రష్యన్లు సోదరులు," "సమస్త ప్రజలమధ్య సోదర మైత్రి సదా వర్ధిల్లుగాక", భూమండలంపై శాంతి సుస్థిరమగుగాక" అన్న నినాదాలు ప్రతిధ్వనించాయి.



లెబనాన్ జాతీయ నృత్యం



ఎల్లెపాటలు పాడుతోన్న. ఫ్రెంచి బ్లాకాఫ్రికా ప్రతినిధులు

# వృత్తి సమావేశాలు

**జి. అలెగ్జాండ్రోవ్**



మాస్కో పవర్ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు, అభిమాన సినీ ప్రేక్షకులు కె. మెర్క్యులోవ్ (ఎడమ), ఐ. సిర్మయా, పోలిష్ సినీ ఫాన్ ఎన్. పోల్ (కుడి) లతో వాస్తు శాస్త్రజ్ఞుల భవనందగ్గర సంభాషిస్తోన్న దృశ్యం



సామ్యవాద శ్రమవీరుడు, షాన్సీ రాష్ట్ర సహకార సంఘాధ్యక్షుడు, వాన్ పో టింగ్ (పి ఆర్ సి), ఫాత్‌దాద్ సమిష్టిక్షేత్ర దళనాయకుడు (ఉజ్బెకిస్తాన్) సామ్యవాద శ్రమవీరుడు, అబ్దుల్ హామిత్ ఉద్యరోవ్ తో (ఎడమ) సంభాషిస్తోన్న దృశ్యం

ఛాయాచిత్రకారుడు. ఎ. అగనోవ్

మహోత్సవ ఉత్సవంలో అత్యంత ప్రముఖమైనవి, వృత్తి సమావేశాలు. ఈ వృత్తి సమావేశాలు, ఇతర కార్యక్రమాలవలె పండుగ దిన వినోద వాతావరణంలోగాక, అతి గంభీరమైన అనేక సందర్భాలలో చైతన్యవంతమైన వాతావరణంలో జరిగాయి.

ఇక్కడ ఈ వృత్తి సమావేశాలు ఇరువై మూడింటి చర్చనీయాంశాలగురించి, అందులో ప్రతిదీ ఎంతో ఆకర్షణీయమైనదైనప్పటికీ, పేర్కొనదగినదే అయినప్పటికీ, చెప్పాలంటే సాధ్యంకాదు.

ఉదాహరణకు, యువకులైన గని పనివారు "మానవశక్తి, రక్షణకు సంబంధించిన ముందు జాగ్రత్తలు, యువకులైన గనిపనివారి ఆరోగ్య పరిరక్షణ" గురించి ఒకరొకరి అభిప్రాయాలను ఈ అవకాశాన్ని పురస్కరించుకొని తెలుసుకొన గలిగారు. ఈ విషయంలో అభిరుచి వుందని గని పనివారేవరుంటారు?

యువజనులు సమిష్టి క్షేత్రాలను స్వయంగా నెలకొల్పుకొని, ఒడుదుడుకులు లేని ఆర్థిక ప్రాతిపదికలమీద నడపడం, సమిష్టిక్షేత్ర నిర్వహణానుభవాలను పరస్పరం వ్యక్తీకరించుకోవడం — ఇది రైతు యువకుల, కృషీవలుల, కౌలుదార్ల చర్చా విషయం.

## భావి ప్రయోజనం

ఈ చర్చలు, బహుశా ఏ సమస్యనూ పరిష్కరించక పోవచ్చు. అయినా చర్చలలో పాల్గొన్నవారు తమకందరికీ సర్వసామాన్యంగా వున్న అంశాలను, ఒకరినుంచి మరొకరు నేర్చుకోవలసినది ఎంతో వున్నదని బాగా గుర్తించారు. ప్రతినిధులు ముందుముందు ఉపయోగ పడగల వ్యక్తిగత సంబంధాలను కల్పించుకో గలిగారు.

వృత్తి విద్యలకు, వృత్తులకు సంబంధించిన సమావేశాలలో పాల్గొన్నవారు ఫ్యాక్టరీలను, కర్మాగారాలను, సమిష్టి ప్రభుత్వ క్షేత్రాలను, పాఠశాలలను, సంస్థలను, మెషీన్ ట్రాక్టర్ కేంద్రాలను, ఇతర సోవియట్ కార్యాలయాలను, పరిశ్రమలను సందర్శించారు.

## కార్మిక పర్వం

వృత్తి సమావేశాలు — చర్చలలో పాల్గొన్న వివిధ వృత్తులకు సంబంధించిన నిపుణులు, "కార్మిక పర్వదినోత్సవం"లో పాల్గొన్నప్పుడు, ఉన్నత స్థాయిని అందుకొన్నాయి. ఈ పర్వదినోత్సవం, వివిధ వృత్తులవారూ కలుసుకొన్నప్పుడు, సంభాషించుకో వడానికి ఒక సమిష్టి భాషను కనిపెడతారన్న అంశాన్ని విశదం చేసింది.

రైతుల, కృషీవలుల, కౌలుదార్ల సమావేశం అఖిల సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనాలయ ప్రాంగణంలో జరిగింది. చిత్రంలో, (ఎడమ నుంచి కుడికి) వియట్‌నామ్ ప్రతినిధులు, రైతు యువతి హోన్‌స్త్రీలీ, హన్‌ఫాన్గ్ రాష్ట్ర, యూత్ యూనియన్ కమిటీ సభ్యుడు, పూర్కీ రోక్, గ్రేట్ బ్రిటన్‌నుండి వచ్చిన ఒక ప్రతినిధితో సంభాషిస్తోన్న దృశ్యం



# ప్రదర్శనలు

> టి. సొలోదొవ్ <

మహోత్సవ సందర్భంగా తెరువబడిన ప్రదర్శన, ఉత్సవాగతు లను, మాస్కో ప్రజలను ఎంతో ఆకర్షించింది.

అంతర్జాతీయ ప్రత్యక్ష, అనువ్రతిత కళాప్రదర్శన ఎంతో విజయవంతమైంది. 3,000 పైగా, 50 దేశాలనుంచి యువ కళా



అమెచ్యూర్ ఛాయా చిత్రకారుల ప్రదర్శన సందర్శకులు, ఇటలీ నుంచి పంపబడిన ఛాయా చిత్ర కళా ఖండాలను పరీక్షిస్తున్న దృశ్యం

కారులు పంపిన ప్రదర్శన వస్తువులను, గోర్కీ పార్కులోని, ప్రకాశమానమైన మూడు పెద్ద పెవిలియన్లలో ప్రదర్శించారు. ఈ పోటీలో పాల్గొన్న యువ కళాకారులకు నిర్ణేతలు స్వర్ణపతకాలు 8, రజత పతకాలు 14, కాంస్యపతకాలు 22 బహూకరించారు.

అమెచ్యూర్, వృత్తిరీత్యా ఛాయాచిత్ర గ్రాహకులైన వారు, 27 దేశాల నుంచి పంపిన ఛాయాచిత్రాలు కుజెన్‌త్‌స్కీ మోస్ట్ వీధి లోని, చిత్రకారుల భవనపు హాలులో ప్రదర్శితమైనాయి. ప్రదర్శనకు 2,000లకు పైగా వచ్చిన చిత్రాలనుండి, 1300ల ఉత్తమ ఛాయాచిత్ర రచనలు ప్రదర్శించను ఎంపిక చేయబడ్డాయి.

మహోత్సవంలో, తపాలబిళ్ళల సేకరణలో ఆసక్తి, అభిరుచి వున్నవారికి అత్యంత మనోహరమైన స్థలం "అంతర్జాతీయ తపాలా బిళ్ళల ప్రదర్శన."

మాస్కోకు పంపబడిన వివిధ వస్తు సంచయాలలో అమూల్యమైనవాటిలో ఒకటి, కలకత్తానుంచి, భారతీయుడు శ్రీ ఘోష్ సంపుటీకరించి పంపినది. ఈ సంచయంలో, ప్రసిద్ధ శాస్త్రజ్ఞుల, కవుల, కళాకారుల చిత్తరువులున్నాయి.

## మహోత్సవ దినచర్య

(13వ పుట తరువాయి)

చేస్తున్నారు. ఒకరినొకరు ముద్దు పెట్టుకొంటున్నారు. లోపలి విషయాలు బయటికి కనబడడానికి వీలుగావున్న కప్పులు,పక్క భాగాలు ఉన్న బస్సులు కనబడుతున్నాయి.వాటిలో ఉన్నవాళ్ళు పాటలు పాడడమే కాదు, నృత్యంకూడా చేస్తున్నారు!

ఒఖోత్నీర్యిచ్ వీధిలో ఒకదానికి ఎదురుగా మరొక బస్సు వస్తూండడం నేను ఇవ్వాళ చూచాను. అవిరెండూ ప్రక్కప్రక్కకు రాగానే వాటిలోపల ఉన్నవాళ్ళు బయటికి చేతులు చాచారు. ఒకరి చేతులతో మరొకరి చేతులు కలిశాయి!

"క్లిక్!"

పొట్టిగా,లావుగావున్న ఒకతను ఆ దృశ్యాన్ని ఫోటో తీశాడు.

ఆనందంతో వికసించిన ముఖంతో అతడు నావైపు తిరిగి ఇలా అన్నాడు, "చూశారూ, నేను పత్రికా రచయితను. కీవ్‌నుంచి వచ్చాను. 'నేస్తం కడుతున్న రెండుబస్సులు' అన్న శీర్షికతో యీ ఫోటోను ప్రకటిస్తే అద్భుతంగా వుండదూ!"



అంతర్జాతీయ తపాలా బిళ్ళల ప్రదర్శన. ఛాయా చిత్రంలో, మహోత్సవపు అంతిమ దినాన. బిళ్ళల సేకరణలో అభిమానులైనవారు, త్వరత్వరగా వీలయినన్ని బిళ్ళల సేకరించుకొనుటలో నిమగ్నులై వున్నారు

"ఉదర్నిక్" చలన చిత్ర ప్రదర్శన శాలలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవావిష్కరణం. 22 దేశాలు పంపిన రమారమి 59 చిత్రాలు ప్రదర్శిత మయినాయి



భారతీయ చిత్ర నిర్మాత రాజ్‌కపూర్ ప్రసంగిస్తోన్న దృశ్యం

# చలనచిత్ర మహోత్సవం


## కియోహీహెూ యుసిహరో

*ఫిల్మ్ డైరెక్టర్, జపాన్, అంతర్జాతీయ చలనచిత్రోత్సవ నిర్ణాయక సంఘ సభ్యులు*


చలన చిత్రోత్సవాన్ని నేను సందర్శించడం, ఇదే ప్రథమం కాదు; 1955 లో, బెర్లిన్‌లో నేను చలన చిత్రోత్సవాలలో పాల్గొన్నాను, గత సంవత్సరం, వెన్నిస్ చలన చిత్రోత్సవ నిర్ణాయకసంఘ సభ్యలలో నే నొకణ్ని.

మొత్తంమీద, ప్రదర్శితమైన చలనచిత్రాల స్థాయి యెంతో ఉన్నతంగా వున్నది. ఉత్తమ చిత్రాలను ఎన్నిక చెయ్యడమన్నది నిర్ణాయక సభ్యులమైన మాకు యెంతో సంక్లిష్ట సమస్య అయినది. 22 దేశాలనుంచి పంపబడిన, 59 చిత్రాలు ఈ చిత్రోత్సవంలో ప్రదర్శింప బడ్డాయి.

నిర్ణాయక సమితి, ప్రదర్శిత చిత్రాలలో ముప్పై ఏడింటికి, 14 స్వర్ణ పతకాలను, 14 రజిత పతకాలను, 9 కాంస్య పతకాలను బహూకరించింది. ఉత్సవ బహుమతులలో ఉన్నత బహుమతి—స్వర్ణ పతకాలు—8 దేశాల చిత్రాలకు; సోవియట్ దేశం, జపాన్, ఇటలీ, హంగరీ, ఛెకొస్లొవాకియా, పోలెండ్, ఫ్రాన్సు, రుమేనియాలకు ఇవ్వబడ్డాయి.

జపాన్ దేశ చలనచిత్ర కళాకారుడనైన నాకు, చలన చిత్రకారుల ఈ సమావేశం, ఎంతో ప్రముఖమైనది. దీనివల్ల, ఈ ఉత్సవంలో చక్కటి ప్రాతినిధ్యాన్ని వహించిన ఐరోపా చిత్రాలనుగురించి తెలుసుకోవడానికి నాకు మంచి అవకాశం చిక్కింది.

ఐరోపా చలనచిత్ర కళాకారులు—నిర్ణాయక సభ్యులు—మా జపాన్ దేశ చిత్రం, "మధ్యాహ్నపు చీకటి"కి స్వర్ణ పతకాన్ని సమర్పించడం, నాకెంతో ముదావహమైంది.

ఇతర నిర్ణాయక సభ్యులకున్న చిక్కులు, చలన చిత్రోత్సవాన్ని గురించి వివరించాలన్నప్పుడు నాకూ ఎదురవుతున్నాయి. నాకు నచ్చిన చిత్రాలన్నింటినీ పేర్కొనడంకూడా యెంతో కష్టమైన విషయమే. ఉత్సవంలో ఏ చిత్రానికి ఏ బహుమతి ఇవ్వబడినదన్న విషయాన్నటుంచి, ఈ సమావేశం ప్రతివ్యక్తికీ యెంతో ప్రయోజనకారి కాగలిగినదని స్వతంత్రించి చెప్పవచ్చు. సృజనాత్మకతకు సంబంధించిన పరస్పర భావ ప్రకటన, ఇతరదేశాలలోని మన సహచరుల కళా విషయిక కృషితో పరిచయం కల్పించుకోవడం, ఈ రెండూ, ఏ కళా రూపపు అభివృద్ధికైనా, చిత్ర కళాభివృద్ధికైనా అత్యంత ప్రధానమైన విషయాలే.



# నృత్యం, పర్వం!

ఎం. పెత్రోవా







మహోత్సవ ప్రప్రథమ సాప్తాహిక సంతతికీ మకుట ప్రాయికమైంది, క్రెమ్లిన్ నృత్యం. పదులు, వేల సంఖ్యలో యువజనులైన అతిథులు, పురాతనపు క్రెమ్లిన్ భవనములో వినోదించారు, నృత్యం చేశారు, పాటలు పాడారు. సంజచీకటి పడగానే బాణా సంచా కాల్చారు. క్రెమ్లిన్ క్రైస్తవాలయాల గోపుర శిఖరాలు రజిత కాంతుల తలమునకలాడాయి; పురాతన కుడ్య పాళికలు తళతళలాడాయి. ఎదురెదురుగా అమ్ములవలె మిలదూసుకపోతున్న రెండు విద్యుత్ శిఖర దీపాలు, చీకటిని జయించి, సువిశాల గగనంలో వెలుగులు విరజిమ్ముతున్నాయి. నిజానికి క్రెమ్లిన్ దేవ లోకంగా మారిపోయింది.

## పర్వదినం

మాస్కో నగరపు పంచముఖాలనుంచీ, 10 ఆగస్టు, రాత్రిన పండుగ ఊరేగింపులు అయిదు బయలుదేరి, నగర మధ్యానకలసి, నగరపు పెద్ద పార్కులు, గోర్కీ పార్కు, సొకొల్నికీ పార్కు చేరుకొన్నాయి. నాలాగే, గోర్కీ పార్కుకువచ్చినవారు, ఇక్కడ జరిగిన కార్యక్రమాలన్నింటినీ చూడలేక పోయినారు.

వాళ్ళు, బాల సంఘపు కొలనును, పడవలతో వెన్నిస్ సరోవర దృశ్యంలాగా వున్నదానిని చూడాలనుకున్నారు; బెరడుతో కట్టిన తిన్నెమీసికి, తెల్ల గడ్డపు సాగర దేవత, సాహసికులైన నావికులతోపాటు ఎక్కాలనుకున్నారు. గ్రామీణ "తురండోత్" ప్రదర్శనలను చూడాలనుకున్నారు, పర్వదినపు లాటరీలలో తమ అదృష్టం ఎట్లా వుంటుందో చూచుకోవాలనుకున్నారు, వినోద వస్త్రధారణ, నృత్య, సంగీతపు పోటీలలో పాల్గొనాలనుకున్నారు.

ఆ సంధ్యామహోత్సవాన్ని అందరూ ఆనందించారు. ప్రతి ఉత్సవ దినచర్య పుస్తకంలోనూ, "ఈ పండుగనాటి రాత్రి నిరుపమానమైంద"ని లిఖించబడక తప్పదు.



# సెలవు, మాస్కో!



ప్రపంచ యువజన ప్రజాస్వామిక సమాఖ్య అధ్యక్షులు, బ్రూనో బెర్నినీ, మహోత్సవ వీడ్కోలోపన్యాసం చేస్తూ



మహోత్సవ పరిసమాప్తాన సోవియట్ క్రీడాకారుల విన్యాసాలు

మహోత్సవం 11 ఆగస్టున పరిసమాప్తమైంది.

అపూర్వమైన ఉత్సవ సంబరాలు ముగియడంతోటే, ఉత్సవంలో పాల్గొన్నవారు స్వీయ దేశాల మీద మనసుమళ్ళిన వ్యథతో మాస్కోను విడిచిపెట్టడంగానీ, లేదా, మాస్కో-వాసులు, మాస్కో నగరం పాడుపెట్టిన ఒక ఆరగింపు శాలగా మారినట్టు భావించుకోవడంగానీ జరగనే లేదు. ఎందువల్లనంటే మాస్కో మహోత్సవం పరిసమాప్తమైనప్పటికీ, ప్రతివ్యక్తీ ఇప్పుడు ఏర్పడిన స్నేహ సంబంధాలు, ఇప్పుడు సేకరించుకొన్న, మనస్సున పడిన అభిప్రాయ పరంపరలు అస్థిరమైనవి కావని గుర్తించాడు, వాటిలో ప్రతిదీ ఒక శాశ్వత ప్రాముఖ్యాన్ని కలిగి వున్నది.

ఒకరొకరు వీడ్కోలు చెప్పుకొనేటప్పుడూ, మాస్కోకు వీడ్కోలు చెప్పేటప్పుడూ, కరచాలనలు చేసుకొనేటప్పుడూ వారు, ఈ స్నేహపథమే ప్రపంచ శాంతికి నిశ్చిత పథమని భావించారు. శాంతికి అభయమన్నది, వివిధ ప్రజల మధ్య, యువజనుల మధ్యవున్న మైత్రిలో అంతర్గతమై వుంది. ఎల్లప్పుడూ, ప్రతిచోటా మన స్నేహాన్ని పటుతరం కానివ్వండి, ఈ సమిష్టి యత్నంద్వారా భూమి మీద శాంతి సౌఖ్యాల ప్రతిష్ఠాపించండి!" అని ఉల్లేఖిస్తున్నది ఆరవ ప్రపంచ యువజనోత్సవ అంతర్జాతీయ సంఘ ప్రకటన. ఉత్సవ సహభోగులందరి హృదయాలలోను ఈ పలుకులు ప్రతిధ్వనిస్తున్నాయి.



సెలవు, మాస్కో!



హర్షధ్వానం

# అయిదు ఖండాల ప్రతినిధుల అభిప్రాయాలు

ఉత్సవానికి వస్తున్నప్పుడు నేను, ప్రపంచం నలుమూలలనుంచి వస్తున్న యువజనులను కలుసుకోవాలని కలలుగన్నాను. నా కలలు వాస్తవమయ్యాయి. సమానత్వంతో, పెద్ద, చిన్న అనే ప్రమేయంలేకుండా అన్ని దేశాల ప్రజలపట్ల సంపూర్ణ గౌరవం అన్న నమ్మికలో జరిగింది మా ఉత్సవం.

ఇంతా వలసలను కలిగివున్న దేశాలనుంచి వచ్చిన యువతీ యువకులు, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు, ఉత్తమ భవిష్యత్తుకొరకు మేం జరుపుతున్న న్యాయమైన పోరాటంలో మాకు సహాయపడతారని నేను ఆశిస్తున్నాను.

కషారా బుష్యర్, సెనిగల్

ఇక్కడ జరిగిన కార్యక్రమాలు మాకు, ఇంకా ఎక్కువ అనుభవాన్ని పొందడానికీ, ఇతర దేశాలలోని మా మిత్రుల ఆచారాలను తెలుసుకోడానికీ, వారి సాంస్కృతిక ప్రదర్శనలను చూడడానికీ, మా మధ్య యేవైనా భేదాభిప్రాయాలుంటే వాటిని పరిష్కరించుకొనేందుకు వారితో చర్చలు జరపడానికీ అవకాశాన్ని కల్పించాయి. అంతేగాకుండా, అందరూ మాలాంటి ఆకాంక్షలనే కలిగి ఉన్నారని గ్రహించాము గాబట్టి, మేము ఏకాకులుగా ఉన్నామని మాకనుపించడంలేదు. యుద్ధంకాదు, శాంతి కావాలి! మనయొక్క యీ ఆకాంక్షను పటిష్ఠం చేసుకొనడమే యిప్పటి మనకర్తవ్యం. నిజానికి మనకందరకు విభిన్న ఆచారాలు, అభిప్రాయాలు, భాషలు వున్నాయి. కాని మనందరికి ఒక 'భాష', "శాంతి, స్నేహాలు" అన్న సమానమైన భాష ఉన్నది.

కాబట్టి స్నేహమే సదా మన మార్గదర్శిగాను, శాంతి మన గృహంగాను ఉండుగాక!

సుధార్సతో, ఉపనాయకుడు,
ఇండోనీషియన్ ప్రతినిధివర్గం.

ఈ ఉత్సవం అమెరికాలో ఇంతకు పూర్వపు ఉత్సవాలకంటే ఎక్కువ ఆసక్తిని కల్పించింది. నేను, ప్రతినిధివర్గంలోని అందరము, యీ మాస్కో పర్యటనలో చాలా సంతృప్తిని పొందాము. ఇక్కడ మేము ప్రపంచం అన్ని ప్రాంతాలనుంచి వచ్చిన యువజనులతో వ్యక్తిగత సంబంధాలను స్థాపించుకొని, ఒకరినొకరం ఇంతకు పూర్వంకంటే యెక్కువగా అర్థం చేసుకొనగలిగాము.

సోవియట్ ప్రజల జీవిత పరిస్థితులను తెలుసుకొనగలగడం. మాకు అన్నిటికంటే ఆసక్తిదాయకమైన విషయంగా ఉన్నది. మేము చూడదలుచుకున్నదంతా చూడగలిగామనికూడా నేను చెప్పగలను. ఒక బాల్‌బేరింగ్ ఫ్యాక్టరీని, క్రస్నయారోజా గుడ్డలమిల్లును, ఒక మిఠాయిలు, కేకుల ఫ్యాక్టరీని మోస్‌ప్రాజెక్ట్ విద్యాసంస్థలు మేము సందర్శించాము. మాస్కోకు సమీపంలో ఉన్న ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని, ఒక ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాన్ని. మెషిన్, ట్రాక్టర్ కేంద్రాన్ని కూడా మేము చూచాము.

సోవియట్ ప్రజలు సంతోషంగా జీవిస్తున్నారనీ, శాంతిని ప్రేమిస్తున్నారనీ నాకు భావం కలిగింది.

డాన్ ఓ కొన్నెల్,
అమెరికన్ ప్రతినిధివర్గ కమిటీ సభ్యుడు

నా మిత్రుడొకడితోపాటు నేను మాస్కోలో చాలామట్టుకు తిరిగాను. ఈ నగరపు విశాలమైన వీధులు, అందమైన పార్కులు, ఎత్తయిన భవనాలు ఒక ప్రత్యేకతను కలిగి వున్నాయి. క్రీడాకారుడనైన నాకు నగరంలోని స్టేడియంలు బాగా నచ్చాయి.

సోవియట్ క్రీడాకారుల ననేకమందిని నేను కలుసుకొన్నాను, స్టేడియంలలో వారితో ఆటలాడలేక పోయినందుకు నాకు విచారం కలిగింది. అయినప్పటికి వారిని యెంతో ఆసక్తితో పరికించాను.

మాస్కోవాసుల ఆతిథ్యాన్ని గురించీ, వారి నిరాడంబరత్వాన్ని గురించీ మా దేశంలోని నా మిత్రులకు తెలియజేయగలుగుతున్నందుకు నాకు సంతోషంగా వున్నది.

బ్రియన్ మెకాఘన్,
యువక కార్మికుడు, ఆస్ట్రేలియా.

స్వదేశానికి తిరిగివెళ్ళాక, నేను పొందిన అనుభవాలన్నింటినీ క్రోడీకరించి, ఉత్సవాన్ని గురించి మా యంత్రాగారంలోని మిత్రులకు చెబుతాను. మా యంత్రాగారం ప్రతినిధిగా వారు నన్నిక్కడికి పంపించారు. మాస్కో ఉత్సవాన్ని గురించి అంతా తెలుసుకోడానికి కుతూహల పడతారు.

వారికి నేనేం చెప్పను? ఎన్నెన్నో విషయాలు. అనువదింప నవసరంలేని "మిర్", "ద్రుజ్బా" అన్న మాటలు మారుమ్రోగిన మరపురాని సమావేశాలు, ప్రసంగాలను గురించీ, అందమైన రష్యన్ యువతులను గురించి నా మిత్రులకు తెలియజేస్తాను.

జియోర్జెస్ సికా,
"స్కోడ్" యంత్రాగారం, టౌర్స్ ఫ్రాన్సు.



## మహోత్సవ దినచర్య

....ఉత్సవం సమాప్తమయింది!

నా మనస్సులో ఒక్కసారిగా యెన్నో ముఖాలు స్ఫురించాయి!

....ఉత్సవంలో పాల్గొన్నవారిప్పుడిక్కడ లేరు. కాని వారు స్నేహస్మృతులను వెనుక వీడి వెళ్ళారు. రైల్వే స్టేషన్ నుంచి బస్సులో తిరిగివస్తూ నేను వాటిని చూచాను. నూతనంగా నాటబడిన స్నేహపు పార్కులో, ఉత్సవ చిహ్నం రూపంలో నాటబడిన పూల మొక్కల నడుమ, పెద్ద సిందూర వృక్షం అగుపడుతున్నది. దానికి "మిత్రతా వృక్షం" అని నామకరణం చేశారు!

నా ప్రక్కనే కూర్చున్న పొడుగాటి తెల్లని గడ్డం గల వృద్ధుడు నా ఆలోచనలను తెలుసుకున్నట్టు ఇలా అన్నాడు: "ఆ సిందూర వృక్షానికి "మిత్రతా వృక్షం" అని పేరుపెట్టారు. మీకుతెలుసా, సిందూర వృక్షం సాధారణంగా చావదు, చాలా, చాలా కాలం బ్రతుకుతుంది..."

# క్రీడాసమీక్ష:








**44** దేశాలనుంచి వచ్చిన, 4000 క్రీడాకారులు పాల్గొన్న స్నేహపూర్వక యువజన తృతీయ క్రీడలు పరిసమాప్తమైనాయి. మాస్కో, క్రీడా స్థలంలో జరిగిన ఈ పన్నెండు రోజుల ఆటలు, క్రీడా చరిత్రలో అద్వితీయ మైనవని, అనేక క్రీడలలో అవి, ఉన్నత ప్రమాణాలను నెలకొల్పాయనీ చెప్పక తప్పదు. ఈయువజన తృతీయ క్రీడా కార్యక్రమంలో 23కార్యక్రమాలున్నాయి. వీటిలో అత్యధిక ప్రాతినిధ్యం వహించిన సోవియట్ దేశ. క్రీడా దళాలు — 21 కార్యక్రమాలలో; ఛెకొస్లొవాకియా దళాలు — 20 కార్యక్రమాలలో; రుమేనియా, పోలెండు దేశాల దళాలు 16 కార్యక్రమాలలో పాల్గొన్నాయి.









## నూతన ప్రమాణాలు

పోటీలలో, మూడింట ప్రపంచ ప్రమాణాలు, ఇరవై అయిదింట జాతీయప్రమాణాలు నెలకొల్ప బడ్డాయి. 39 క్రీడల స్థాయి ఎంతో పెంపొందించ బడింది. ఈ నవీన ప్రమాణాలు, పరుగుపోటీలలో, పదహారింట జాతీయ ప్రమాణాలను నెలకొల్పి, 10 ఆటల స్థాయిని ఉన్నత మొందించాయి.

గణనీయమైన ఫలితాలు 5,000, 1,500 మీటర్ పరుగులలోను; పురుషుల జవెలిన్ అండ్ షాట్ పందేలలోను, 80 మీటర్ల హర్డిల్ రేస్, స్త్రీల 200మీటర్ల పరుగు పందెంలోను సాధించబడ్డాయి ఈత పోటీలలో, 11 జాతీయ, 8 క్రీడా ప్రమాణాలు నెలకొల్ప బడ్డాయి. పురుషులు పోటీలలో ఎంతో విజయప్రదమైన ప్రదర్శన నిచ్చారు. ఒక్క ఈత పోటీలు, రెండాటలలో మాత్రమే ఇదివరలోసాధించిన ప్రమాణాలు అధిగమించబడలేదు. 200 బ్రెస్ట్ స్ట్రోక్ పోటీ4 × 400 మీ. కంబైన్డ్ రిలే. బరువు లెత్తుటలో 'వెయిట్ లిఫ్టర్స్ ఆశ్చర్యప్రాయకమైన ఫలితాలను చూపించారు. ఛెన్ త్సిజిన్ కే, ఫ్లైవెయిట్ (చైనా) సోవియట్ దేశ క్రీడాకారులు ఎవ్ గెనీ మినియేవ్ (ఫెదర్ వైట్) విక్టర్ బుషుయేవ్ (లైట్ వైట్) మూడు ప్రపంచ రికార్డులను నెలకొల్పారు.





## సామూహిక క్రీడా పందేలు

సామూహిక క్రీడా పందేలలో ఉత్సవ బహుమతులకు వివిధ దేశాలకు చెందిన 24 ఫుట్ బాల్ దళాలు, 56 వాలీబాల్ దళాలు పోటీ చేశాయి. వ్యక్తిగత పోటీలయిన క్రాస్—కన్ట్రీరన్, చదరంగం, టేబుల్—టెన్నిస్‌లలో 500 మంది క్రీడాకారులు పోటీ చేశారు.

ఉత్సవ స్పోర్ట్స్ బ్యాడ్జి పోటీలలో, 100,000 పైగా పాల్గొన్నారు, ఇంటర్నేషనల్ హైకర్స్ ర్యాలీలో 25 దేశాలకు చెందిన 350 మంది ప్రతినిధులు పాల్గొన్నారు.



## మైత్రికి ప్రతీక

వివిధ దేశాలకు చెందిన, వివిధ వృత్తులకు చెందిన ప్రజలు మాస్కో స్టేడియంలో కలుసుకొన్నారు. ఆల్బేనియా ఉపాధ్యాయుడు, హెల్‌సింకీకిచెందిన తాళాలు బాగుచేసేవానిని, ఒక కెయిరో విద్యార్థిని ఆమ్‌స్టర్ డామ్ పాఠశాల విద్యార్థి కలుసుకోవడం జరిగింది. ఒక్క క్రీడలలోనే ఈ గణనీయ ప్రమాణాలు నెలకొల్ప బడలేదు. ఉత్సవ పోటీలలో పాల్గొన్న వారంతా స్నేహానికి అపూర్వ ప్రతీకగా ఒక ఉన్నత ప్రమాణాన్ని నెలకొల్పారు.





భారత ప్రజలతో తమకున్న మైత్రికీ, వారిపట్ల ఉన్న గౌరవానికీ చిహ్నంగా సోవియట్ ప్రజలు భారతీయ మహత్తర జాతీయ దినాలను ఆనందంతోను ఉత్సాహంతోను జరుపుకొంటుంటారు. అందువల్ల. సహజంగానే, సోవియట్ దేశంలో యీమధ్య భారత స్వాతంత్ర్య దినోత్సవాన్ని, భారత జాతీయ తిరుగుబాటు శతవార్షికాన్ని ఎంతో ఉత్సాహపూరితంగా జరుపుకొన్నారు, సోవియట్ ప్రజలు.

ప్రజలకు భారత దేశాన్ని గురించి విపరంగా తెలియడానికి అనేక సోవియట్ నగరాల్లోను, పట్టణాల్లోను సభలు ఉపన్యాసాలు, రేడియో ప్రసంగాలు యేర్పాటు చేయబడ్డాయి. ప్రముఖ వార్తాపత్రికలు యీ ఉత్సవాల ప్రాముఖ్యతను గురించి వ్యాఖ్యానించాయి. భారత రిపబ్లిక్ సాధించిన ఆర్థిక, తదితర విజయాలను కొనియాడాయి.

మాస్కోలో యీ ఉత్సవాలు గొప్పగా జరిగాయి. యీ సందర్భంలో జరిగిన అనేక సభలలో ప్రజలు అధిక సంఖ్యల్లో పాల్గొన్నారు. చెయికొవిస్కీహాలులో జరిగిన సభ అన్నిటికంటే ముఖ్యమైనది. సోవియట్ దేశ ఆరోగ్యశాఖ మంత్రిణి ఎమ్. కోవ్రిగినా, భారత రాయబారి కె.పి.యస్. మీనన్ ఈ సభలో సుదీర్ఘ ఉపన్యాసాలను ఇచ్చారు. ఇతర ఉపన్యాసకులు భారత స్వాంత్ర్యాన్ని హర్షిస్తూ, 1857 తిరుగుబాటును గురించి మాట్లాడారు.

కోవ్రిగినా చేసిన ప్రారంభోపన్యాసంలో భారత దేశ వ్యవహారాల పట్ల సోవియట్ ప్రజలకుగల ప్రగాఢ ఆసక్తి సువ్యక్తమయింది. పూర్వపు వలసబానిసత్వఫలితంగా కలిగిన ఆర్థిక దుష్ఫలితాలనుండి సంపూర్ణంగా బయటపడటానికి భారత దేశం సలుపుతున్న కృషినిగురించి ఆమె మాట్లాడింది. ఉభయ దేశాల మధ్య ఉన్న మైత్రిని గురించి ఆమె చెప్పింది. ఈ మైత్రి, విభిన్న సాంఘిక రాజకీయ వ్యవస్థలుగల దేశాలు సహజీవనం నెరుపుతూ, శాంతియుతంగా సహకరించుకొనగలవన్న లెనిన్ సిద్ధాంతం యొక్క వాస్తవతను గట్టిగా నిరూపిస్తుందని ఆమె అన్నది. భారత దేశ విదేశాంగ విధానాన్ని గురించి ప్రస్తావిస్తూ, అది గొప్ప ప్రాముఖ్యతను కలిగి వున్నదని చెప్పింది. దురాక్రమణ కూటముల పట్ల భారత దేశం చూపే వ్యతిరేకతను గురించి

(మిగత 28 వ పుట చూడుడు)

"ఆసియా దిఙ్మండలంలో ఒక నవీన తార, స్వాతంత్ర్యపు తార వెలసింద'ని జవహర్‌లాల్ నెహ్రూ సరిగ్గా పది సంవత్సరాల క్రితం అన్నార"ని చెబుతూ కె. పి. ఎస్. మీనన్ తమ ఉపన్యాసాన్ని ప్రారంభించారు. "1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందింది. అనగా మరొక కొత్త ప్రభుత్వ పతాకంమాత్రం అస్తిత్వంలోకి వచ్చిందనిగాని, మిత్రరాజ్య సమితిలో మరొక దేశం స్వతంత్రవాణిని పొందడం మాత్రం జరిగిందనిగాని అనుకోగూడదు. దీని ప్రాముఖ్యత అంతకు మించికూడా వున్నది. ఒక్క భారత దేశానికేగాక, సమస్త ఆసియాదేశాలకూ యిది ఒకశకం అంత్యాన్ని, వాస్కోడగామా శకం అంత్యాన్ని తెలియజేస్తుంది. ఆఫ్రికాలోగూడా యీ శకం అంత్యాన్ని ఇది సూచిస్తుంది. ఇది, యూరపుకు గూడా, ప్రాచ్య దేశాలతో సహజము, ఆరోగ్యవంతము, మరింత అనుకూలము, శాశ్వతము అయిన ప్రాతిపదిక మీద సంబంధాలను స్థాపించుకోడానికి అవకాశాన్ని కల్పించింది. ఈ విధంగా 1947 ఆగస్టు 15 వ తేదీని మనం ఒక్క భారతదేశ చరిత్రలోనే గాక, ప్రపంచ చరిత్రలోగూడా ఒక ప్రముఖ ఘట్టంగా పరిగణించవచ్చును.

"ఈ రోజున మేము స్వతంత్ర భారత దేశంయొక్క దశమ వార్షికోత్సవాన్ని జరుపుకొంటున్నాము. 1857 లో భారత దేశంలో విదేశీ ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఒక వీరోచిత తిరుగుబాటు జరిగింది. అది అంత కట్టుదిట్టమైన యేర్పాట్లతో జరుగక పోయినప్పటికీ, విస్తృతంగాను, తీవ్రంగాను కొనసాగింది. కాని ఆ తిరుగు

(మిగత 28వ పుట చూడుడు)

భారతదేశ దశమ స్వాతంత్ర్యదినోత్సవం, బ్రిటిష్ వలస పెత్తందార్లకు వ్యతిరేకంగా 1857లో జరిగిన భారతజాతీయ తిరుగుబాటు శత వార్షికోత్సవ సందర్భంగా శైకొవస్కీ గానమందిర ప్రాంగణంలో మహోత్సవం జరుపబడింది
ఛాయాచిత్రంలో: వార్షిక మహోత్సవ అధ్యక్షవర్గం





ఇటీవల, సెర్గీ ముఖిన్ ఒక అద్భుత ఔషధాన్ని తయారుచేశారు

## ప్రశ్నోత్తరాలు

మా పాఠకులు డాక్టర్ ఎస్.ఎమ్.అలమ్. ఎమ్.డి.ఎస్.(హోమియోపతి)(మన్‌భుం, బహార్),సురేష్‌కుమార్ జైన్(లుధియానా. పంజాబ్), ఎమ్. ఎన్. ఖాన్ (బార్వాధి, బిహార్).జగన్నాధ్ సాహు(కాకడ్‌పూర్). కర్తార్ సింగ్ (పాటియాలా). పి. బాలన్. (కొయ్రుకోడ్), జి. సి. హెచ్. వెంకటేశ్వర్లు, (రేపల్లె), గిరిజా భూషణ్‌గుహ మజాద్ (కలకత్తా) సోవియట్ దేశంలో హోమియో పతికి గల స్థానాన్ని గురించి అడుగుతు న్నారు. హోమియోపతి వైద్యం చేసే వారికీ, అలోపతి వైద్యం చేసేవారికి మధ్య పెద్ద వైరుధ్యంవున్నది. అందువల్ల ఆ విష యాన్ని గురించి తెలుసుకోవాలను ఆసక్తి మా పాఠకులకు వుండవచ్చు.

ఈ వ్యాసంలో మేము సూక్ష్మంగా హోమియోపతి పుట్టు పూర్వోత్తరాలనూ సోవియట్ దేశంలో యీ రెండు పద్ధతుల మధ్య వైరుధ్యం వున్నదా అన్నవిషయాన్ని గురించి తెలియజేయడానికి ప్రయత్నిస్తాము.

# సోవియట్ దేశంలో హోమియోపతి వైద్యం

ఇ. స్వెత్లనోవా

హోమియోపతి వైద్యవిధానం వైద్య చరిత్రలో అతి క్లిష్టకాలమైన 18వ శతాబ్దాంతంలో ఉద్భవించింది. రక్త స్రావం చేయించడం, వాతలు పెట్టడం, తీవ్రంగా వాంతులు చేయించడం, పొక్కులు పొక్కిపోయే పట్లు వేయడం అప్పటి వైద్యవిధానాలుగా ఉండేవి. వైద్యులకు ఓషధులగురించి కొద్దిపాటి విజ్ఞానమే ఉండేది. అదయినా పెద్ద మోతాదుల్లో ఆ ఓషధులను ఇవ్వడం మూలంగా ఒకొక్క పర్యాయం అది ప్రాణాంతకంగా పరిణమిస్తుండేది.

అలాంటి సమయంలో, సామ్యుల్ హనిమన్ అనే ఒక సాధారణ జర్మన్ వైద్యుడు ప్రధమ పర్యాయంగా వైద్య ప్రపంచానికి పరిచయమయ్యాడు. ఆరో గ్యవంతమైన శరీరంపైన, రోగగ్రస్థ



మంచి డాక్టర్ కావాలంటే, చెయ్యవలసిన కృషి ఎంతో వుంటుంది. డాక్టర్ బయటికి వెళ్లిన ఒక అపూర్వ తరుణంచూచి మేము అక్కడ ప్రవేశించాము





డాక్టర్ సెర్గీ ముఖీన్ దగ్గరపెద్ద అత్తరపు సూచిక వుంది

మైన శరీరంపైన ఓషధుల ప్రభావాన్ని గురించి బాగా పరిశీలన జరిపిన తర్వాత ఆయన ఒక వింత విషయాన్ని కనుగొన్నారు. ఆరోగ్యవంతమైన శరీరంపైన చెడు ప్రభావాన్ని కలిగించే ఓషధులు, అతి స్వల్పమైన "హోమియోపతి" మోతాదులలో ప్రయోగింపబడినట్లయితే వ్యాధిగ్రస్తమయిన శరీరంలోని వ్యాధులను నయం చేస్తాయని ఆయన కనిపెట్టాడు. హోమియోపతి మూలసూత్రానికి మూలం యిదే; సాదృశ్యతా సూత్రం, స్వల్ప మోతాదుల సూత్రమేఅది.

ఆ రోజుల్లోకూడా హోమియోపతి వైద్యుల వాదన సక్రమమైనదనీ, వారు కనిపెట్టిన పద్ధతులు అవస్యమని సువ్యక్తమవుతున్న విషయాలను కాదనడం అసాధ్యమైపోయింది. ఏందువల్లనంటే యేదైనా ఓషధి చిన్నచిన్న మోతాదులలో యివ్వబడినట్లయితే అది జీవకణాల్లోకి చొరుచుకు పోవడం సులభంగా జరుగుతుంది. అందువల్ల అది తక్షణమే శరీరంపైన పనిచేస్తుంది. పెద్ద మోతాదులలో యిచ్చినట్లయితే అది జీవ కణాలను మందగింపజేస్తుంది. అదే మోతాదు స్వల్పంగా యివ్వబడినట్లయితే జీవకణాలపై బాగా పనిచేస్తుంది.

ఆ సంవత్సరాలలో హోమియోపతి వైద్యాన్ని గురించి వివిధ దేశాలలో వంద లాది గ్రంథాలు వ్రాయబడ్డాయి. హోమియోపతి శాస్త్రీయమైన వైద్యంకాదనీ, బాగా స్థిరపడి వున్న అలోపతీ వైద్యానికి అది వ్యతిరేకమైనధనీ పరిగణింప బడింది. ఈ వైద్య విధానం అనేక అగచాట్లకు లోను గావింపబడింది. అయినా ప్రశంసలనూ అందుకోకపోలేదు.

ఈ విధంగా హనిమన్ కనుగొన్న వైద్య విధానం వైద్యంలో ఒక శకాన్ని ప్రారంభించింది. కాని ఇంతవరకూ అది వివాదగ్రస్థ విషయంగానే వున్నది. హోమియోపతి వైద్య విధానాలను అనేకమంది అలోపతి వైద్య విధానపు వైద్యులు గుర్తించడం లేదు. ఇందుకు కారణం వున్నది: హోమియోపతి పద్ధతులు కలుగజేసే వైద్య ప్రభావానికి ఆధునిక విజ్ఞాన శాస్త్రం ఇంతవరకు సైద్ధాంతిక వివరణను ఇవ్వలేక పోయింది.

మరి, సోవియట్ దేశం మాటేమిటి? ఈ దేశంలో హోమియోపతి ఏ విధంగా పరిగణింప బడుతుంది?

చాలాకాలం క్రితమే 1918 లో, సోవియట్ ప్రజారోగ్య శాఖ యేర్పాటు చేయబడుతున్నప్పుడే, ఆధునిక విజ్ఞాన శాస్త్రంయొక్క విజయాలన్నీ మానవ శ్రేయస్సుకొరకు వినియోగింవ బడాలని అభిప్రాయపడ్డాము. తత్ఫలితంగా, ఈ రెండు వైద్య విధానాలకు సమాధానం కుదిర్చేపరిష్కారం కనుగొన బడింది. ఆ విధంగా అలోపతీ వైద్య విధానానికి హోమియోపతి వైద్య విధానానికి వైరుధ్యం లేకుండా చేయబడింది. హోమియోపతి ఆధునిక వైద్య విధానంలో ఒక పద్ధతిగా పరిగణింపబడ సాగింది. ఆ వైద్య విధానంలో ఇంకా తేలవలసి వున్న విషయాలను అలా వదిలివేయకుండా, వాటిని గురించి పరిశోధనలు జరపాలని నిర్ణయింపబడింది.

సోవియట్ దేశంలోని అనేక నగరాలలో హోమియోపతి హాస్పిటళ్ళు, ఫార్మసీలు వున్నాయి. అంతేగాక అనేకమంది అలోపతి



విరామ సమయంలో డాక్టర్ సెర్గీముఖిన్ ప్రాచ్య కళను అభ్యసిస్తారు, ఇంట్లో ఆయన అభిమాన స్థలం, "ప్రాచ్య విభాగం"



వైద్యులు తమ వైద్యంలో హోమియోపతి పద్ధతులను ఉపయోగిస్తున్నారు. హోమియోపతి వైద్యంలో శిక్షణనిచ్చే విద్యా సంస్థలు మాకు లేకపోయినా, వైద్య కళాశాలలోని ప్రతి విద్యార్థికి ఈ వైద్య విధానం యొక్క మూల సూత్రాలతో పరిచయం కల్పింప బడుతుంది. ఆ విద్యార్థులలో ఎవరైనా హోమియో వైద్యాన్నే అధ్యయనం చేయదలుచుకుంటే అందుకు ఆటంకాలేమీ వుండవు.

ఉత్తమమైన క్లినిక్కులలోను, వైజ్ఞానిక విద్యా సంస్థలలోను హోమియోపతి చికిత్సా పద్ధతులు యెల్లప్పుడూ పరిశోధింపబడుతూ వుంటాయి. ఈ పరిశోధనల ఫలితాలు ప్రఖ్యాత సోవియట్ శాస్త్రజ్ఞుల చేత చర్చించబడుతూ వుంటాయి. హోమియోపతి వైద్యాన్ని గురించి వ్రాయబడిన అనేక విదేశీ గ్రంథాలు రష్యన్ భాషలోకి అనువదింపబడ్డాయి. గ్రన్నికోవా హోమియోపతి వైద్యాన్ని గురించి తాజా వివరాలతో వ్రాసిన ఒక బృహద్గ్రంథం లెనిన్ గ్రాడ్‌లో 1956 లో ప్రకటింపబడింది. అలోపతి క్లినిక్కులలో హోమియోపతి శాఖలను ప్రారంభించడానికి గూడా ఉద్దేశింప బడుతున్నది.

డాక్టర్ సెర్గీ ముఖిన్ కళాఖండ సేకరణలో నిపుణుడు. ఆయన కళా సంచయంలోని ఒక దారు శిల్ప దృశ్యం



ఈ రంగానికి సంబంధించిన తాజా విషయాలను తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో మేము, మాస్కోలోని ఒక హోమియోపతి క్లినిక్కులో పనిచేసే డాక్టర్ ముఖిన్‌ను కలుసుకున్నాము. అతని దగ్గర వైద్యాన్ని పొందేవారు అతనిని యెంతో గౌరవంతోను, ప్రేమతోను చూస్తారు.

ఆధునిక హోమియోపతి వైద్యవిధానం ప్రస్తుతం అనేక వ్యాధుల చికిత్సకొరకు ఉపయోగింప బడుతున్నదని డాక్టర్ ముఖిన్ తెలియ జేశారు. ఉబ్బస వ్యాధి, కాలుడు పుండ్లు, కీళ్ళనొప్పులు, ఉదరంలోని వ్రణాలు, ప్రేవులకు సంబంధించిన వ్యాధులు, ఇంకా ఇతరమైన అతి ప్రమాదకర వ్యాధులు హోమియోపతి వైద్య పద్ధతితో బాగు చేయబడుతున్నాయని ఆయన చెప్పారు. వృద్ధాప్యానికి సంబంధించిన అస్వస్థతలను బాగు చేయడంలో ఈయన ప్రత్యేకంగా కృషి సల్పుతున్నారు. ఈ సందర్భంలో ఆయన, యీ మధ్యనే తనకు వచ్చిన ఒక ఉత్తరాన్ని మాకు చూపించారు. అందులో ఇలా వున్నది: "....అది మొదలుకొని నేను నా వయస్సునే మరిచిపోయాను. అది యెలా జరిగిందోకూడా నాకు తెలియడంలేదు. శరీరానికి పటుత్వం వచ్చింది. జ్ఞాపకశక్తి వచ్చింది. ఎంతో ఉత్సాహంగా వున్నాను. ఇదంతా మీ చేతిచలవే...."

వృద్ధాప్య అస్వస్థతను కుదర్చవచ్చునని డాక్టర్ ముఖిన్ నమ్ముతున్నారు. అది ఆయన స్వంత మాటల్లోనే చెబితే బాగుంటుంది: "అక్కడ వున్న మూసలోని ద్రవాన్ని ఒకసారి చూడండి. దానిపైన "విటా" అని వ్రాయబడి వున్నది. అనగా "జీవం"—ఆనందదాయకమూ, అనంతము అయిన పదం! జీవితాన్ని సుదీర్ఘం చేసుకోవాలని యెందరెందరు ప్రజలు యుగయుగాలుగా కలలు కంటున్నారు! దీర్ఘాయువు మర్మాన్ని తెలుసుకోవాలని పరిశోధనలు జరిపిన వందలాది కథలను నేను ప్రాచీన రచనల్లో చదివాను. సోవియట్ దేశంలోగూడా దీర్ఘాయువు సమస్య, శాస్త్రీయ వైద్యంలో ఒక ముఖ్య సమస్యగా పరిశోధింప బడుతున్నది."

మధ్య వయస్సు వచ్చినవారి కెవ్వరికైనా "విటా"తో చికిత్సచేయవచ్చునని డాక్టర్ అన్నారు. ఇందుకు ఆధారంగా ఆయన తాను వైద్యం చేస్తున్న వారి వద్దనుండి వచ్చిన ప్రశంసాపూర్వక లేఖలను చూపించారు.

ఒక్క వ్యాసంలో హోమియోపతి వైద్యానికి సంబంధించిన వివిధాంశాలను తెలియజేయడంకష్టం. వైద్యులు యే వైద్యశాఖలోకృషి చేస్తున్నా సరే, అంతా మానవుల ఆరోగ్యాన్ని పెంపొందించ డానికి పాటుపడుతూ వుంటారు. వారు జరిపే యీ కృషికి ప్రభుత్వం సహాయం చేస్తుంది....

డాక్టర్ సెర్గీ ముఖిన్ ఆగత గృహంలో



# నూతన చారిత్రక దశ నందుకొన్న సోవియట్ దేశ ఆర్థిక వ్యవస్థ

< మిఖైల్ యకొవ్లెవ్ మాస్టర్ ఆఫ్ సైన్స్, ఆర్థికశాస్త్రం >

మే నెలలో మాస్కోలో జరిగిన సోవియట్‌దేశ సుప్రీమ్ సోవియట్ సప్తమసమావేశంలో, యావత్తు సోవియట్ పరిశ్రమల పైన ప్రభావం పడేట్టి ముఖ్యనిర్ణయాలు చేయబడ్డాయి. తత్ఫలితంగా దేశ ఆర్థిక విధానము దాని పరిణామ క్రమంలో ఒక నూతన చారిత్రక దశలో అడుగు పెట్టింది; ఇది మొదలుకొని మంత్రిత్వశాఖలు గాక, ఆర్థిక నిర్వాహక ప్రాంతాలలో ఏర్పాటు చేయబడిన ఆర్థిక సంఘాలే ప్రాథమిక నిర్మాణ రూపాలుగా వుంటాయి.

వైమానిక, రక్షణ, నిర్మాణ, విద్యుచ్ఛక్తిలాంటి ఎనిమిది సోవియట్ దేశ పారిశ్రామిక మంత్రాంగశాఖలను మాత్రమే కేంద్రం కింద అట్టిపెట్టుకోడానికి నిర్ణయింపబడింది. తక్కిన శాఖల బాధ్యత వివిధ ప్రాంతాలలోని స్థానిక సంస్థలపైననే ప్రత్యక్షంగా వుంటుంది. రిపబ్లిక్‌లకు, వాటికి ఇష్టమున్నట్లయితే తమ స్వంత పారిశ్రామిక మంత్రాంగాలను యేర్పాటు చేసుకోడానికి అధికారం ఇవ్వబడింది. కాని పరిశ్రమల నిర్వహణ బాధ్యత ప్రధానంగా ఆర్థిక సంఘాల పైననే పడుతుంది.

దేశం మొత్తంమీద 105 ఆర్థిక సంఘాలు (ఆర్థిక ప్రాంతాల సంఖ్య ననుసరించి) స్థాపింపబడ్డాయి. వాటిలో రష్యన్ సమాఖ్యలో 70, ఉక్రెయిన్‌లో 11, కజఖస్తాన్‌లో 9, ఉజ్బెకిస్తాన్‌లో 4 వున్నాయి. ఇతర యూనియన్ రిపబ్లిక్‌లలో ఒక్కొక్క ఆర్థిక ప్రాంతం వుండడం మూలాన, దాని ననుసరించి ఒకొక్క ఆర్థిక సంఘం యేర్పాటు చేయబడింది. జూలై మాసం ప్రారంభానికల్లా దీనికి సంబంధించిన యేర్పాట్లన్నీ పూర్తి చేయబడ్డాయి.

సోవియట్ దేశంయొక్క జాతీయ ఆర్థిక విధానము ఇప్పుడు ఒక బ్రహ్మాండమైన క్లిష్ట నిర్మాణంగా రూపొందడం మూలాన మౌలికమైన యీ పునర్నిర్మాణము అవసరమయింది. 206,000 కు మించి పారిశ్రామిక సంస్థలు, 100,000 కు మించి నిర్మాణ స్థావరాలు వున్నాయి. గత సంవత్సరం జాతీయార్థిక రంగంలో 50 మిలియన్ల మంది నియోగింపబడ్డారు.

సహజంగానే, బ్రహ్మాండంగా పెరిగిపోతున్న పారిశ్రామికోత్పత్తినీ, నిర్మాణపు పనులను ఒకే కేంద్రంనుండి నడిపించడం నానాటికీ కష్టతరమైపోతూ వచ్చింది. లభ్యమవుతున్న శక్తి, సంపదలను, పూర్వపు నిర్వాహక సంస్థలు, పరిపూర్తిగా ఉపయోగించుకొనలేకపోయాయి. కార్యకర్తలలో కొందరు ప్రత్యక్షంగా ఉత్పత్తి పనిలో పాల్గొనడానికి వీలులేకుండా నిర్వాహక కార్యకలాపాలలోకి మళ్ళింపబడవలసి వచ్చింది. ప్రభుత్వ శాఖల పద్ధతిమీద అత్యధిక కేంద్రీకరణ జరగడంవల్ల మంత్రాంగాలు ఉత్పత్తికి దూరమైపోవడమూ విషయాలను సరిగ్గా అర్థం చేసుకొని పని నడిపించలేక పోవడమూ జరుగుతూ వచ్చింది. ఈ విధంగా ప్రభుత్వశాఖ ప్రాతిపదిక పైన పనులు జరగడంవల్ల పరిశ్రమల ఉత్పాదకశక్తులూ, మూలాధారాలు పూర్తిగా వినియోగించుకొనబడలేక పోయాయి. గృహ నిర్మాణ సంస్థలు వివిధ మంత్రాంగాల శాఖలలో చెల్లాచెదురుగా వుండిపోవడంవల్ల మూలాధారాలు చెల్లాచెదరై పోవడమూ, ఉపయోగింపబడకుండా ఉండిపోవడమూ, నిర్మాణకాలము పొడిగింపబడిపోతూ రావడమూ, వ్యయం అధికమై పోవడమూ జరిగింది. అందువల్లనే పరిశ్రమలు, నిర్మాణాల నిర్వాహణలో కొత్త మార్పులు అవసరమయ్యాయి.

## ఆర్థిక సంఘాలు: అవి యెలా పనిచేస్తాయి

ఇదివరకే తెలియజేయబడినట్లుగా, నిర్వాహణయొక్క ప్రధాన స్వరూపం ఆర్థిక సంఘంగా రూపొందింది. స్థానిక సంస్థల హక్కులను విస్తృతం చేయడానికీ, ఆర్థికాభివృద్ధి పట్ల వాటి బాధ్యతను అధికం చేయడానికీ, ఆర్థికరంగ నిర్వహణలో ప్రజలు ఇంకా ఎక్కువగా పాల్గొనేటట్టు చేయడానికీ ఇది అవకాశం కల్పించింది. జాతీయార్థిక రంగాన్ని విజయవంతంగా నడిపించడానికి ఉత్పత్తి, నిర్మాణాల నిర్వహణలో సాధ్యమైనంత మంది ప్రజలు పాల్గొనేటట్లు చూడాలనీ, వారి అనుభవాలు సమష్టి చింతన వినియోగించుకొనబడాలనీ, నూతన విప్లవాత్మక రూపాలకొరకు అన్వేషణ జరగాలనీ వి. ఐ. లెనిన్ ప్రబోధించారు.

ఈ ఆర్థిక సంఘాలు ఎలా పనిచేస్తాయి? రిపబ్లిక్‌లు, ప్రాంతాలు, మండలాలలో ఈ సంఘాలు ఆర్థిక సమితులను, యంత్రాగారాలను, నిర్మాణ స్థావరాలను నడుపుతూ వుంటాయి. సాధారణ జాతీయార్థిక ప్రణాళిక నిర్దేశించిన పనుల కనుగుణ్యంగా వారు ఆ సంస్థలను నడుపుతారు. ఈ ఆర్థిక సంఘాలకు వారి ఆర్థిక కార్యకలాపాల కన్నిటికీ అవసరమైన హక్కులు ఇవ్వబడ్డాయి. జాతీయార్థిక ప్రణాళిక నిర్దేశించిన పనులను నిర్వర్తించడానికీ, తమ యంత్రాగారాలు, నిర్మాణ స్థావరాల నిర్వహణకూ అవి సంపూర్ణ బాధ్యతను వహిస్తాయి. ఈ ఆర్థిక సంఘాలు ఉత్పత్తి, నిర్మాణ కార్యకలాపాలలో ప్రస్తుత కార్యక్రమాన్నీ, దీర్ఘకాల కార్యక్రమాన్నీ తయారుచేసి అమలు పరుస్తాయి. యంత్రాగారాల మొత్తం ఉత్పత్తినీ, సాంకేతిక స్థాయినీ పెంపొందించేటట్లు చూస్తాయి. ఆర్థిక నిర్వహణామండలాల పరిధిలోను, బయటకూడా ముడిసరుకులు, సగం ఉత్పత్తి చేయబడిన వస్తువుల మార్పిడికి పథకాలను తయారుచేసి, అమలు జరిగేటట్లు చూస్తాయి.

ఉదాహరణకు, మాస్కోనగర ఆర్థిక నిర్వహణ మండలం, దేశంలోని ఇతర ఆర్థిక మండలాలన్నిటికంటే గొప్పది. దాని

యొక్క ఆర్థిక సంఘం లోహం, యంత్ర పనిముట్లు, సున్నితమైన పనిముట్లు, కార్లు, రసాయనిక వస్తువులు, వివిధ రకాల నిత్య వినియోగ వస్తువులను ఉత్పత్తిచేసే 500 పైగా యంత్రాగారాలు, ఫ్యాక్టరీలను తన చేతికిందికి తీసుకొన్నది. వేరువేరు పనుల నిర్వహణకు వేరువేరు విభాగాలు గూడా యేర్పాటు చేయబడ్డాయి. ప్లానింగు, ఆర్థిక విషయాలు, ఉత్పత్తి, సాంకేతిక విషయాలు, ప్రత్యేకకృషి, సహకారము, అమ్మకాలు, కార్మిక విభాగం, వేతనాల విభాగం మొదలైన విధంగా అవి విభజింపబడ్డాయి. యంత్రాగారాలు ప్రత్యేకించి కొన్నివస్తువుల ఉత్పత్తిలో జరిపే కృషిని పెంపొందజేయడం, ఈ కొత్త పద్ధతి యొక్క ముఖ్యాంశాలలో ఒకటి. ఉదాహరణకు, ఈ ఆర్థిక సంఘంక్రింద ఖచ్చితమైన కొలత నిచ్చే సున్నితపనిముట్లను ఉత్పత్తిచేసే యంత్రాగారాలు 30 ఉన్నాయి. ఈ 30 యంత్రాగారాలు ఒకేరకమైన డిజైన్లు, సాంకేతిక పద్ధతులు, ఒకముల వస్తువులను తయారు చేస్తాయి. (పూర్వం యీ యంత్రాగారాలు పదకొండు, మంత్రాంగాలు, శాఖల ఆధ్వర్యంలో ఉంటుందేవి). ఇందువల్ల, సున్నితపనిముట్ల నిర్మాణ రంగంలో సాధింపబడిన నూతన విజయాలను వినియోగించుకొని వాటి ఉత్పత్తిలో అభివృద్ధిని తీసుకురావడం సాధ్యమవుతుంది. మరొక ఉదాహరణ చూడండి, మాస్కో ఆర్థిక సంఘం యొక్క నిర్మాణ యంత్రాగార నిర్వహణ విభాగంకింద 27 యంత్రాగారాలు ఉన్నాయి. వాటిలో టవర్ క్రేన్లు ఉత్పత్తిచేసే యంత్రాగారాలు యేడు ఉన్నాయి. పూర్వం ఈ యంత్రాగారాలు 6 మంత్రాంగాలక్రింద ఉంటుండేవి. ఇప్పుడు అన్నీ ఒకే అధికారం క్రిందికి రావడంలో, వివిధ శాఖల్లో ఉండడంవల్ల యేర్పడిన అవరోధాలు తొలగిపోయి ఉత్పత్తిలో ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించడానికి అవకాశం కలుగుతున్నది.

........ఖార్కోవ్ ఆర్థిక నిర్వహణ ప్రాంతం ఉక్రెయిన్‌కు చాలా ప్రాముఖ్యతను కలిగివున్నది. ఖార్కోవ్, పొల్తవా, సుమ్మీ మండలాలు యీ ప్రాంతంలో ఉన్నాయి. రిపబ్లిక్ యొక్క పూర్తి ఉత్పత్తిలో 15 శాతాన్ని యీ ప్రాంతం ఉత్పత్తి చేస్తుంది. 400 పారిశ్రామిక యంత్రాగారాలు, 49 నిర్మాణ సంస్థలు ఖార్కోవ్ ఆర్థిక సంఘం క్రిందికి వచ్చాయి. ప్రధాన యంత్రోత్పత్తి కేంద్రమయిన ఖార్కోవ్ యంత్రాగారాలు కూడా దీనిక్రిందికి వచ్చాయి.

ఖార్కోవ్ ఆర్థిక సంఘం యొక్క దృష్టి ఇప్పుడు వస్తువులను అందజేయడం సమస్యలపైన కేంద్రీకృతమై ఉన్నది. అనేక యంత్రాలు, యంత్రభాగాలు ఉక్రేనియన్‌లోని ఇతర ప్రాంతాలకు, బైలో రష్యాకు, రష్యన్ సమాఖ్యకు, తదితర రిపబ్లిక్‌లకూ పంపెంచబడ్డాయి. పూర్వం వస్తువులను అందజేయడం విషయంలో అన్ని యంత్రాగారాలు కాలనియమాన్ని సరిగ్గా పాటించేవి కావు. కాని ఇప్పుడు ఆర్థిక సంఘం, ఉత్పత్తి అయిన వస్తువులు నియమిత కాలంలో అందజేయబడుతున్నాయా లేదా అని పర్యవేక్షణచేస్తూ, ఉత్పత్తి, సహకారం, ప్రాంతాలమధ్య సంబంధాల విషయంలో ముఖ్యమైన మార్పులను ప్రవేశపెట్టడం మూలాన పరిస్థితులు బాగుపడ్డాయి.

ఆర్థిక సంఘాల యొక్క సాంకేతిక-ఆర్థిక బోర్డులకు ఒక ముఖ్యమైన పాత్ర ఇవ్వబడింది. వాటిలో పారిశ్రామిక సంస్థల నిర్వాహకులు, పార్టీ, కార్మిక సంఘాలు, వైజ్ఞానిక విద్యాసంస్థల ప్రతినిధులు, ఇంజినీర్లు, డిజైనర్లు, ప్రముఖ నిపుణులు, ప్రముఖ కార్మికులు ఉంటారు. ఈ సాంకేతిక-ఆర్థిక బోర్డులు, ప్రాంతాలలోని పారిశ్రామికాభ్యుదయానికి సంబంధించిన సమస్యలనూ, సహకారం, ఉత్పత్తి పెంపుదల, ఖర్చుల తగ్గింపుకు సంబంధించిన నిర్దిష్ట సమస్యలనూ పరిష్కరించడానికి ఆర్థిక సంఘాలకు సహాయపడుతాయి.

## అప్పుడే గొప్ప ఫలితాలు వస్తున్నాయి

*ఆర్థిక సంఘాలు పని ప్రారంభించిన మొదటి నెలలోనే గొప్ప ఫలితాలు లభించాయి. పరిశ్రమలు, నిర్మాణపు పనులలో కొత్తరకపు నిర్వహణపద్ధతి ఆచరణలో దాని ప్రయోజనాలను అప్పుడే వ్యక్తం చేసింది. మొదటి విషయం యేమిటంటే, యీ కొత్త పద్ధతి వివిధ శాఖలక్రింద పరిశ్రమలు ఉండడంవల్ల యేర్పడే అవరోధాలను తొలగించి, ఒకే ఆర్థిక ప్రాంతంలో వున్న వివిధ పరిశ్రమల మధ్య మామూలు సంబంధాలను నెలకొల్పుతుంది. వస్తువుల అనవసరపు రవాణా అరికట్టబడి, మూలాధారాలు పరిపూర్తిగా వినియోగించుకొనబడుతున్నాయి.*

జాతీయార్థిక రంగం నిర్వహణలో ముందడుగు వేయడమంటే సోవియట్ దేశ ప్రధాన ఆర్థిక కర్తవ్యాన్ని నెరవేర్చడమన్న మాట: తల ఒక్కింటి ఉత్పత్తిలో చారిత్రాత్మకమైన కొద్ది కాలపరిధిలో బాగా అభివృద్ధి పొందిన పెట్టుబడిదారి దేశాలను మించిపోవడమన్నమాట.

పరిశ్రమలు, నిర్మాణాల పనుల నిర్వహణలో ఈకొత్త పద్ధతి గురించి సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ అధ్యక్షవర్గం చేసిన అధికార ప్రకటనను సోవియట్ స్త్రీ, పురుషులు యెందువల్ల అంత ఉత్సాహంతో హర్షించారో దీనినిబట్టి అర్థం చేసుకొనవచ్చును.

మాలెంకోవ్, కగనోవిచ్, మొలటోవ్‌ల పార్టీ వ్యతిరేక ముఠాను గురించి సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ జూన్ ప్లీనరీ సమావేశం చేసిన నిర్ణయాన్ని గూడా సోవియట్ప్రజలు యేకగ్రీవంగా యెందుకు ఆమోదించారన్న విషయాన్ని గూడా దీనిని బట్టి అర్థం చేసుకొనవచ్చు. కుట్రలకు పూనుకున్న యీ ముఠా, పారిశ్రామిక నిర్వహణ యొక్క యీ పునర్నిర్మాణాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ కుట్రదారులూ, ముఠాతత్వవాదులూ పాత భావాలకూ, పద్ధతులకూ దాసులైపోయారు. వారు నూతన పరిస్థితులను గమనించక, ఎప్పుడో కాలదోషం పట్టిపోయిన రూపాలు, పద్ధతులను పట్టుకు వ్రేళ్లాడజొచ్చారు. సోషలిస్టు పరిశ్రమలు ఒక బ్రహ్మాండమైన స్థాయికి వచ్చి, త్వరితగతిని అభివృద్ధి పొందుతూ ఉన్న ప్రస్తుత దశలో, మరింత బ్రహ్మాండమైన అభివృద్ధిని సాధించడానికి కొత్తవీ, స్థితిస్థాపకతకు అనుగుణమైనవీ అయిన ఆర్థిక నిర్వహణ రూపాలు అవసరమవుతాయన్న విషయాన్ని వారు అర్థం చేసుకొనదలుచుకోలేదు.

ఆర్థిక సంఘాలయొక్క ప్రథమచర్యలు ప్లీనరీ సమావేశ నిర్ణయాలు సరియైనవని నిరూపిస్తున్నాయి. ఇప్పటికే వచ్చిన ఫలితాలు ఏకైక ప్రభుత్వ పథకాన్ననుసరించి అభివృద్ధి పొందుతున్న సోవియట్ ఆర్థిక రంగానికి, ఉత్పత్తి శక్తులు ఇంకా అభివృద్ధి పొందే అవకాశాలు యేర్పడుతున్నాయని వ్యక్తం చేస్తున్నాయి.

# భారత స్వాతంత్ర్య దినోత్సవ సభలో కె. పి. ఎస్. మీనన్ ప్రసంగం

(22వ పుట 2వకాలం తరువాయి)

బాటుకు కేంద్రీకృత నాయకత్వము, గమ్యం విషయంలో విస్పష్టత లేకపోవడం మూలాన, నిర్దాక్షిణ్యంగా అణిచివేయబడింది. అయినా, అది భారత ప్రజలకు ఒక గుణపాఠంగా పనిచేసింది. 1857 లో అవలంభింపబడిన పద్ధతులద్వారా భారత దేశం స్వాతంత్ర్యాన్ని పొందలేకపోయింది. మూడవ అలెగ్జాండర్ జారును హత్య చేయడానికి జరిగిన ప్రయత్నం — ఇందులో లెనిన్ సోదరుడు పాల్గొని ఉరితీయబడ్డాడు — వి. ఐ. లెనిన్‌కు ఒక గుణపాఠంగా ఉపయోగపడినట్లుగానే, 1857 తిరుగుబాటు భారతీయులకు గుణపాఠంగా పనిచేసింది. ఆసంఘటన తర్వాత పదిహేడు సంవత్సరాలవాడైన లెనిన్, "మనం వెళ్ళవలసిన మార్గం అదికాదు. ఇంకొక మార్గాన్ని అనుసరిద్దాము" అనుకొన్నారు.

"భారత దేశం కూడా తన స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోడానికి మరొక మార్గాన్ని అనుసరించింది," అన్నారు కె. పి. ఎస్. మీనన్. "కష్టతరమైన ఉన్నత క్రమశిక్షణా పూరిత మార్గం, 1857 నాటి మార్గంకంటే వివేకవంతము, శక్తివంతము అయిన మార్గాన్ని మహాత్మా గాంధి భారత దేశానికి సూచించారు.

"లెనిను, గాంధి తమ తమ దేశాలలో రాజకీయ రంగంలో ఒకే కాలం ప్రవేశించారన్న విషయం తెలుసుకొనడం ఆసక్తి దాయకంగా వుంటుంది.

"1917వ సంవత్సరం ఒక నూతన శకాన్ని ప్రారంభించిందని భవిష్యత్ చరిత్రకారులు అంగీకరిస్తారు. ఆ సంవత్సరం లెనిన్ సుదీర్ఘము, కష్టతరము అయిన ప్రవాసంనుండి రష్యాకు తిరిగివచ్చారు. అదే సంవత్సరం మహాత్మగాంధి, ఆఫ్రికాలో పాతుకుపోయివున్న జాతి విచక్షతకు వ్యతిరేకంగా అనేక సంవత్సరాలపాటు పోరాడిన అనంతరం భారత దేశానికి తిరిగి వచ్చారు. అంతే, 1917కు ముందు భారత దేశంలో స్వాతంత్ర్యోద్యమం లేదని కాదు. అదే విధంగా 1917కు ముందు రష్యాలో విప్లవోద్యమం లేదనడం కూడా సరికాదు. 1917కు పూర్వం భారత దేశంలో మేధావంతుల ప్రతినిధులు కొద్దిమంది, కొందరు రాజకీయ నాయకులు మాత్రమే స్వయం పరిపాలన కొరకు జరిగే ఉద్యమంలో పాల్గొనేవారు. మహాత్మ గాంధి దానిని ప్రజా ఉద్యమంగా మార్చివేశారు. ప్రజానీకాన్ని వారి నిద్రావస్థనుంచి మేల్కొల్పారు. ప్రజల మనస్సులలోను, హృదయాలలోను స్వాతంత్ర్య బీజం నాటబడగానే, ఆ బీజం ఒక బ్రహ్మాండమైన స్వాతంత్ర్య వృక్షంగా పెరగడాన్ని యేదీ ఆపలేకపోయింది.

"భారత దేశం తాను స్వాతంత్ర్యం పొందిన ప్రథమ దశకములో యేమి సాధించింది? స్వాతంత్ర్యం ప్రజలలోని శక్తిని విడుదలచేసి, వారు సాంఘిక రాజకీయ, ఆర్థిక, పరిపాలన సమస్యలలో నిమగ్నులయ్యేందుకు తోడ్పడ్డది. ఇంగ్లీషువారి పరిపాలనా కాలంలో నిరంకుశ ప్రభువుల పరిపాలనలో ఉంటూవచ్చిన వందలాది చిన్న చిన్న సంస్థానాలు భారత రిపబ్లిక్‌తో ఐక్యం గావింపబడ్డాయి. మతం ముసుగులో మా సమాజంలోని చొరుచుకు పోయిన అనేక దురలవాట్లు. కొంతవరకు చట్టాల ద్వారాను, కొంతవరకు ప్రజాభిప్రాయం వత్తిడి ద్వారాను పెరికివేయబడ్డాయి. భూసమస్య పరిష్కరింపబడుతున్నది. భూపంపకం జరిగి, రైతులలో సహకార పద్ధతి బాగా ప్రోత్సహింపబడుతున్నది. సోవియట్ దేశం వలెనే భారత దేశం ప్లానింగ్ ప్రాముఖ్యతను బాగా గుర్తిస్తుంది. మా ప్రథమ పంచవర్ష ప్రణాళిక పూర్తిగా విజయాన్ని పొందింది. ప్రజలత్యాగం మరింతగా అవసరమయ్యే రెండవ పంచవర్ష ప్రణాళికను ఈమధ్యనే మేము ప్రారంభించాము. అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే, మా విదేశాంగ విధానము ఒక ఖచ్చితమైన స్వరూపాన్ని పొందింది. ఇప్పటికే భారత దేశం ప్రపంచంలోని వివిధ భాగాలలో — కొరియా, ఇండోచైనా, మధ్యప్రాచ్యంలోను, మిత్రరాజ్య సమితిలోను — తాను శాంతికొరకై పోరాడుకున్నట్లు వ్యక్తంచేసింది.

"గడచిన వాటిని గురించి, ప్రస్తుత విషయాలను గురించి ఇలా మనం చెప్పవచ్చు. మరి భవిష్యత్తుమాటో? త్వరలోనే మీరు మీ విప్లవం నలభైయవ వార్షికోత్సవాన్ని జరుపుకొనబోతున్నారు. ఇప్పటినుంచి నలభై సంవత్సరాల తర్వాత, 1997లో భారత దేశం యెలా రూపొందబోతుంది? ఇంకా శక్తివంతమవుతుందనడంలో సందేహం లేదు. కాని శక్తికి మాత్రమే మేము విలువనివ్వము. రాక్షసునివలె బ్రహ్మాండమైన శక్తిని కలిగి ఉండడం మంచి విషయమే కాని, దానిని రాక్షసునివలె ఉపయోగించడం మాత్రం దారుణమని షేక్స్‌పియర్ అన్నారు. రాక్షస శక్తిగల శత్రువులు మాకులేరు గాబట్టి, మాకు ఆ రాక్షస శక్తి అనవసరం. అనేక త్యాగాలు చేసి సంపాదించుకున్న మా స్వాతంత్ర్యాన్ని రక్షించుకోడానికి అవసరమైనంత మట్టుకే మాకు బలం అవసరం. అంతకు మించవద్దు, అంతకు తక్కువలోనూ ఉండము.

"మాప్రజల శ్రేయోభిలాషే మాకు అన్నిటికంటే ఆసక్తివంతమైనది. 1997 నాటికి మా ప్రజలు ఇప్పటికంటే ఆరోగ్యవంతంగాను, ఆనంద దాయకంగాను, విద్యావంతులుగాను ఉంటారన్న దాంట్లో సందేహమేమీ లేదు. అప్పటికల్లా ప్రచ్ఛన్న యుద్ధం అంతమొంది, అంతర్జాతీయ సంబంధాలు బాగుపడుతాయని ఆశిద్దాము. విభిన్న రాజకీయ వ్యవస్థలను కలిగి వున్నప్పటికి, ప్రపంచమంతటా శాంతిని నెలకొల్పాలన్న ఆశయాన్ని కలిగివున్న భారతదేశం, సోవియట్ దేశాల మైత్రి అంతర్జాతీయ సంబంధాలను బాగుపర్చే పనిలో శక్తివంతమైన పాత్రను వహించగలదని నేను గట్టిగా నమ్ముతున్నాను. కాబట్టి నేను, ఉత్సవాలు జరిగిన గత రెండువారాలు, మాస్కో నగరంలో మూలమూలల మారుమ్రోగిన "శాంతి, మైత్రి!" అన్న ఆ రెండు పదాలను ఉచ్చరిస్తూ ఈ ఉపన్యాసాన్ని ముగిస్తున్నాను.

## సోవియట్ దేశంలో భారత స్వాతంత్ర్య దినోత్సవం

(22వ పుట 1వకాలం తరువాయి)

ముఖ్యంగా పేర్కొన్నది కోప్రిగినా, గోవాపై భారత దేశంయొక్క హక్కును బలపరుస్తూ యావత్తు సోవియట్ ప్రజలు యీవిషయంలో భారత దేశాన్ని బలపరుస్తున్నారని తెలిపింది.

ఆసక్తిదాయకమైన యీసభ, భారత స్వాతంత్ర్య దినోత్సవం యొక్క ఆనందపు వాతావరణాన్ని వెల్లడించే పర్వదినంగా మారింది. బొంబాయినుండివచ్చిన ప్రఖ్యాత "లిటిల్ బ్యాలెట్ ట్రూప్" కొన్ని జానపద నృత్యాలను ప్రదర్శించి ప్రేక్షకుల మనస్సులను రంజింపజేసింది. తిరువాన్కూరు సోదరిత్రయంలోని ఇద్దరు సోదరీమణులు రాగిణి, పద్మిని చక్కని శాస్త్రీయ నృత్యాన్ని చేసారు. వీరుగాక సోవియట్ కళాకారులుగూడా ప్రదర్శనల నిచ్చారు.

(మిగత 30వ పుట చూడుడు)

అంతర్జాతీయ సమీక్ష

# నిరాయుధీకరణ చర్చలు

## "పాటవ పరీక్షల విరమణను", ఇతర సమస్యలతో ముడిపెట్టవద్దని జోరిన్ అభ్యర్థన

> మిత్రరాజ్య సమితి నిరాయుధీకరణ కమిషన్ ఉపసంఘం కార్యకలాపాలలో ఒక విపరీత పరిస్థితి రూపొందింది. ఉపసంఘం వాస్తవానికి పనిచేయడమే లేదు. పాశ్చాత్య ప్రతినిధివర్గాలు వివిధ నెపాలతో సమావేశాలు జరుగనివ్వకుండా చూస్తుండడంవల్ల ఉపసంఘం సమావేశమవడం లేదు. ఈ విధంగా, ఆగస్టు 20వ తేదీన జరగడానికి నిర్ణయింపబడిన సమావేశం వారి కోర్కెపైన ఆగస్టు 21తేదీకి వాయిదా వేయబడింది. ఈ సమావేశాన్ని గూడా వాయిదా వేయించడానికి వారు ప్రయత్నించినట్లు తెలియవచ్చింది.
>
> ఆగస్టు 21వ తేదీన సమావేశం జరుపకుండా తిరిగి వాయిదా వేయడాన్ని సోవియట్ ప్రతినిధివర్గం తీవ్రంగా ఆక్షేపించింది. ఆ సమావేశంలో మాట్లాడుతూ సోవియట్ ప్రతినిధి వి. ఎ. జోరిన్ ఇలా అన్నారు:

అణ్వాయుధోత్పత్తి పోటీ నిలుపుదల, అణు, ఉదజని ఆయుధపాటవ పరీక్షల తక్షణ విరమణ సమస్య ఇప్పుడు అత్యంత తీవ్ర అంతర్జాతీయ సమస్యగా తయారయింది. యావత్ప్రపంచంలోని కోటానుకోట్ల ప్రజలదృష్టి దీనిపైననే కేంద్రీకృతమై వున్నది.

ఇలాంటి పరిస్థితులలో ఉపసంఘ సమావేశాలను పదేపదే వాయిదా వేయడాన్ని, పాశ్చాత్య రాజ్యాల ప్రతినిధులు ఉపసంఘములో అణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షల తక్షణ విరమణపై సమిష్టిచర్చలను తప్పించుకోడాన్ని, అణ్వాయుధోత్పత్తి పోటీ విరమణ, అణుయుద్ధ ప్రమాదం తొలగింపుపట్ల యేలాంటి చర్యలు, చివరికి కనీసపు చర్యలుగూడా తీసుకోరాదన్న పాశ్చాత్య రాజ్యాల అయిష్టతగా మాత్రమే అంచనా కట్టవచ్చును.

ప్రజలు అణ్వాయుధోత్పత్తి పోటీ ఇంకా కొనసాగుతుండడాన్ని చూచి చాలా భయపడుతున్నారు. జరుగుతున్న ప్రతి పాటవ పరీక్ష, మానవులను మూకుమ్మడిగా హతమార్చే ఆయుధాల అభివృద్ధిలో మరొక అడుగు ముందుకు వేయబడినట్లు వ్యక్తం చేస్తున్నది. ప్రపంచ ప్రజానీకం, అణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షలను అణు యుద్ధానికి ప్రత్యక్ష సన్నాహాలుగా పరిగణిస్తున్నదంటే అది సమంజసంగానే వున్నది.

అణు, ఉదజని ఆయుధాల పాటవపరీక్షల విరమణపై ఒడంబడికను చేసుకొనమని కోరుతూ వివిధ ప్రజా సంస్థలు, రాజకీయ పార్టీలు, కార్మిక సంఘ, సహకార సంఘ సమాఖ్యలు, మతవర్గాలు చేసిన తీర్మానాలను, విజ్ఞప్తులను సోవియట్ ప్రతినిధివర్గం అప్పుడే అనేక పర్యాయాలు ఉపసంఘం సభ్యుల దృష్టికి తెచ్చింది. ప్రపంచంలోని వివిధదేశాల పార్లమెంట్లు, ప్రభుత్వాలు అధిక సంఖ్యలో దీని ఆవశ్యకతను నొక్కి చెప్పాయి.

### ఉప సంఘం పనిచేయాలి

నిరాయుధీకరణ సమస్యను పరిష్కరించాల్సిన బాధ్యత తనపైనున్న మిత్రరాజ్య సమితి ఉపసంఘం ఈ విజ్ఞప్తిని పెడచెవినిపెట్టి ఊరుకోడానికి వీల్లేదు. అయినప్పటికి, ఈ ముఖ్య సమస్యకు ఖచ్చితమైన పరిష్కారం నేటివరకు కనుగొనబడలేదన్న విషయాన్ని తెలియజేయవలసి వుంటుంది....

అణు, ఉదజని ఆయుధ పాటవపరీక్షల నిషేధ సమస్య విడిగా తీసుకొని ఇతర నిరాయుధీకరణ సమస్యలపైన మనం అంగీకారానికి వచ్చేవరకు వేచి వుండకుండా, వేరుగా పరిష్కరించాలనిమేము ఉపసంఘం సమావేశం ప్రారంభంలోనే మార్చి 18వ తేదీన ప్రతిపాదించాము.

పరిష్కారం త్వరితంగా జరగాలన్న ఆదుర్దాతో పాటవపరీక్షల విరమణసమస్యా పరిష్కారాన్ని గురించి ఇలాంటి వైఖరి అవలంబింపబడింది. ఒడంబడికను సుసాధ్యం చేయాలన్న ఉద్దేశ్యముతో, అణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షల సంపూర్ణ విరమణకు పాశ్చాత్యరాజ్యాలు సంసిద్ధంగా లేవన్న విషయాన్ని గమనికలోకి తీసుకొని, ఈ పాటవపరీక్షల తాత్కాలిక విరమణకు మేము అంగీకరిస్తూ ప్రకటించాము.

సోవియట్ దేశం తీసుకొన్న యీ చర్యకు పాశ్చాత్య రాజ్యాలిచ్చిన సమాధానమేమిటి?

### పాటవపరీక్షల నమోదు ప్రతిపాదన విరమించుకొనబడ్డది

మొట్టమొదట వారు పాటవ పరీక్షల నిలుపుదలపై ఒక అంగీకృత నిర్ణయానికి ప్రయత్నించడాన్ని తప్పించుకోజూచారు. అణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షల విషయం ముందుగా నమోదు చేయాలన్న విషయం ముఖ్యమైనదికాదనీ, అణు, ఉదజని పాటవ పరీక్షల కొనసాగింపుకు ఇదొక ముసుగు అనీ అందరూ గుర్తించినప్పటికి, ఆ పాటవ పరీక్షల నమోదు విషయం మాత్రమే చర్చించడానికి తమ ఇష్టాన్ని తెలిపారు.

కాబట్టి, పాశ్చాత్య రాజ్యాలు చేసిన ఈ ప్రతిపాదనకు ప్రజల తోడ్పాటు లభించలేదంటే దానిని మనం అర్థం చేసుకొనవచ్చు. చివరికి వారు దానిని విరమించుకొనవలసివచ్చింది. పాశ్చాత్య రాజ్యాలు, సోవియట్ దేశం పాటవ పరీక్షల విరమణపై కంట్రోలును గురించి చెప్పడం లేదన్న నెపంతో సోవియట్ ప్రతిపాదనను వ్యతిరేకించాయి.

### నిర్దిష్ట ప్రతిపాదనలు

కంట్రోలు సమస్య ఒడంబడికకు ప్రధానావరోధంగా చేయబడుతున్న విషయాన్ని గమనికలోనికి తీసుకొని, సోవియట్ దేశం తన దృక్పథాన్ని తెలిజేయసి, జూన్ 14వ తేదీన, సోవియట్

దేశం, అమెరికా, బ్రిటన్ భూభాగాలలోను, పసిఫిక్ ప్రాంతంలోను కంట్రోలు కేంద్రాలను స్థాపించడంతోపాటు, అంతర్జాతీయ కంట్రోలు క్రింద రెండు, మూడు సంవత్సరాలవరకు పాటవ పరీక్షల నిలుపు దలకు నిర్దిష్ట ప్రతిపాదనలను చేసింది. ఈ సోవియట్ ప్రతిపాదన ఏర్పాటు, సంప్రదింపులలో పాల్గొంటున్న పక్షాల మధ్య ఒడంబడిక కుదరడానికి మరే అవరోధాలు ఉన్నాయనడానికి వీల్లేదు.

జూలై రెండవ తేదీన సమిష్టిగా చేయబడిన ప్రకటనలో పాశ్చాత్యరాజ్యాలు, పర్యవేక్షణ విషయంలో ప్రాథమిక చర్యలను ప్రవేశపెడుతూ, సాయుధ బలాలను, ఆయుధాలను తగ్గించడం లాంటి సమస్యలపైనా, సైనికావసరాల కొరకు విదళనీయ వస్తోత్పత్తి విరమణపైన ఒడంబడిక కుదిరే పక్షంలో పాటవ పరీక్షలను ఆపడానికి నిర్ణయాన్ని వెలిబుచ్చాయి. ఈ కోర్కెలు, అంగీకరించుటకు వీలుకాని, ఒడంబడికకు ప్రాతిపదికను సమకూర్చని రూపంలో పాశ్చాత్యరాజ్యాలచేత ప్రతిపాదింపబడ్డాయని యీ సందర్భంలో చెప్పవలసి వుంటుంది. పాశ్చాత్య రాజ్యాలు పాటవ పరీక్షల నిలుపుదలపై నిర్ణయానికి ఇప్పటికే మూడు షరతులను పెట్టారు. వైమానిక పర్యవేక్షణా మండలాలను యేర్పాటు చేయబడడంతో సహా, హఠాత్ దాడులను అరికట్టడానికి కంట్రోలువ్యవస్థను స్థాపించడమూ, నేలపై కంట్రోలు పోస్టులను స్థాపించడము కూడా షరతుగా పెట్టబడుతున్నది.

పాశ్చాత్య రాజ్యాల యొక్క ఇలాంటి వైఖరి త్వరితంగా ఒడంబడిక కుదరడానికి దోహదమివ్వగలదా? అలా యెప్పటికీ దోహదమివ్వదు.

అణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షల విరమణ మార్గంలో వివిధ షరతులను తెచ్చిపెడుతూ ఉండడం, సమీప భవిష్యత్తులో యీ సమస్యను పరిష్కరించేందుకు త్రికరణశుద్ధితో పనిచేయడానికి ఆకాంక్షను చూపుతున్నట్లుగా పరిగణింపబడజాలదు.

## కృత్రిమ సంబంధం

నిజానికి, పాటవ పరీక్షల విరమణ సమస్యను ఉదాహరణకు సాయుధబలాలు, ఆయుధాల తగ్గింపు సమస్యలలాంటివాటితో ముడి పెట్టడందేనికి? అలా ముడిపెట్టడానికి కారణమేమిటి? వాయు, భూపర్యవేక్షణ మండలాల స్థాపనకూ, పాటవ పరీక్షల నిలుపుదలకూ మధ్య ఉన్న సంబంధం యేమిటి? ఈ సంబంధాలు ఎంత కృత్రిమమైనవో విస్పష్టంగా తెలుస్తుంది. అందువల్ల వాటిని గురించి వేరే వ్రాయనక్కరలేదు.

పాటవ పరీక్షల విరమణ సమస్యను, సైనికావసరాల కొరకు విదళనీయ వస్తోత్పత్తి విరమణ సమస్యతో ముడిపెట్టడంలో ఉద్దేశ్యమేమిటి? అవశ్యంగా పరిష్కరింపబడవలసిన సామాన్యమైన పాటవపరీక్షల విరమణ సమస్యా పరిష్కారాన్ని లేకుండా కాలయాపన చేసుకొంటూ పోవడమే దీని ఉద్దేశ్యమని తేలుతుంది.

## ఒడంబడిక సాధ్యమవుతుంది

*పాటవ పరీక్షల విరమణపై ఒడంబడికకు రావడానికి ఇప్పుడు గొప్ప అవకాశాలున్నాయని అందరికీ వ్యక్తమవుతున్నది. ఎందుకంటే, ఈ సమస్యపై భిన్న అభిప్రాయ భేదాలు అధిగమింపరానివి కావు.*

*పాశ్చాత్య రాజ్యాలు, అభిప్రాయ భేదాలు ఇంకా యెక్కువగా వున్న ఇతర సమస్యలతో పాటవ పరీక్షల విరమణ సమస్యను ముడిపెట్టక పోయినట్లయితే, ఎంతో కాలం క్రితమే పరస్పర అంగీకృతమైన ఒడంబడిక కుదిరి వుండేది..*

*పాశ్చాత్య రాజ్యాలు, అణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షలవిరమణ సమస్యను పట్టుదలతో, వ్యవహార సరళిలో చర్చించి, పరిష్కరింప దలచినట్లయితే, సంప్రదింపులలో పాల్గొంటున్న పక్షాల దృక్పథంలో ఇంకా చాలా భేదాభిప్రాయాలు వుంటున్న నిరాయుధీకరణ అంశాలతో అణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షల విరమణను ముడిపెట్టడం మానుకోవాలి.*

## సమస్యయొక్క అత్యావసరత

పాశ్చాత్య రాజ్యాలు, అణు, ఉదజని ఆయుధ పాటవపరీక్షల విరమణ సమస్యయొక్క ప్రాముఖ్యతను, అత్యావసరతను గమనికలోకి తీసుకొని, దాని ఖచ్చితమైన పరిష్కారానికి అంగీకరిస్తాయనీ, ఈ రంగంలో ఒడంబడికకు అవరోధం కల్పించే షరతులకొరకు పట్టుపట్టరనీ మేము ఆశిస్తున్నాము.

అణు, ఉదజని ఆయుధ పాటవపరీక్షల శాశ్వతిక నిలుపుదల సమస్య యేలాంటి కాలయాపన లేకుండా పరిష్కరింప బడగలదనీ, పరిష్కరింపబడి తీరాలని సోవియట్ ప్రతినిధివర్గం అభిప్రాయ పడుతుంది. తనకు సంబంధించినంత మట్టుకు, యావత్ప్రపంచాన్ని కలవర పరుస్తున్న ఈ సమస్యపై ఒడంబడికకు రావడానికి ఉపసంఘంలోని ఇతర ప్రతినిధి వర్గాలతో సహకారానికి ప్రయత్నించడానికి ఆకాంక్షను చూపుతున్నది.

---

## సోవియట్ దేశంలో భారత స్వాతంత్ర్య దినోత్సవం

(28వ పుట తరువాయి)

మాస్కోనగర వార్తాపత్రికలన్నీ యీ ఉత్సవాలను గురించి వ్యాసాలను ప్రకటించాయి. ఒక్క పత్రికనుగురించి చెబుతాను. "ఇజ్వెస్తియా" ఆగస్టు 15వ తేదీన యీ విషయాన్నిగురించి ప్రధాన వ్యాసంలో ప్రస్తావిస్తూ, స్వాతంత్ర్యం పొందిన పది సంవత్సరాల కాలంలో భారత దేశం ఆర్థిక, సాంఘిక, సాంస్కృతికాభ్యుదయములో సాధించిన గొప్ప విజయాలను గురించి పేర్కొన్నది. శాంతి పరిరక్షణ విషయంలో భారత దేశం కృషిని హర్షిస్తూ, "ఇజ్వెస్తియా" దేశాలమధ్య శాంతి, సహకారాల కొరకు భారత దేశం నిర్విరామ కృషిని జరుపుతున్నదని వ్రాసింది. కొరియా, వియత్నామ్, ఈజిప్టులలో పోరాటాన్ని విరమింపజేయడంలో ప్రధానపాత్రను వహించినందుకు భారత దేశాన్ని ప్రశంసించింది. ఇంకా ఆ పత్రిక, మూకఉమ్మడిగా ప్రజావినాశనాన్ని గావించే ఆయుధాల నిషేధానికి భారత దేశం ఇస్తున్న తోడ్పాటును గురించి చెబుతూ, ఈ విషయాలన్నీ భారతదేశానికి ప్రపంచమంతటా గౌరవాన్ని తెచ్చిపెడుతున్నాయన్నది. సోవియట్ స్త్రీ, పురుషుల తరపున అది, భారత ప్రజలకు సోదర శుభాకాంక్షలను తెలియజేసింది.



# మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థి మధుకర్ దేశముఖ్

< బి. వొరెఖోవ్ >

భారతీయ ప్రజలకూ, సోవియట్ ప్రజలకూ మధ్య సజీవమైన సంబంధమే లేని రోజులు ఉండేవి. అప్పుడు భారత దేశాన్ని పాలిస్తున్న విదేశీయులు అలా సంబంధాలు యేర్పడకుండా చేసారు. భారత దేశం తన స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్న తర్వాత మాత్రమే ప్రథమ పర్యాయంగా ఉభయ దేశాలమధ్య స్నేహ సంబంధాలు యేర్పడ్డాయి. నూతన అవకాశాలు యేర్పడ్డాయి. తత్ఫలితంగా ఉభయదేశాల ప్రజల జీవితంలోని వివిధరంగాల్లో ఇంకా ఎక్కువగా ఉపయోగకరమైన సంబంధాలు యేర్పడ్డాయి.

పాఠ్య సంవత్సరం పరిసమాప్తం కావడంతోటే, మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థి మధుకర్ దేశముఖ్ మాతృభూమి, భారత దేశానికి విమానంలో తిరిగి వెళ్లాలనుకుంటున్నాడు.

చిత్రంలో, ఆ విద్యార్థి, మాస్కో విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర విభాగంలో అయిదవ సంవత్సర శిక్షణ పొందుతున్న మిత్రుడు, ఆర్సెన్ ఎఫాయెవ్‌కు తను ప్రయాణించనున్న దారి చూపుతున్నాడు (పైన)



← విరామదినాన్ని ఎట్లాగడపాలా అని, స్నేహితులు చర్చిస్తున్నారు(ఎడమనుండి కుడికి): ఆర్సెన్ ఎఫాయేవ్, మాస్కో విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర విభాగపు అయిదవ సంవత్సర శిక్షార్థి, మధుకర్ దేశముఖ్, మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థి, ల్యుద్మిలా కుజెనెత్సోవా, అర్థశాస్త్ర విభాగపు అయిదవ సంవత్సర విద్యార్థిని, విక్టర్ ఒన్చెస్కూ, (రుమేనియా) మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థి



ఉదయపు వ్యాయామం →



విశ్వవిద్యాలయ పఠన మందిరంలో మధుకర్ దేశముఖ్, ఐలోఫ్రెర్యా ఐన్ (రుమేనియా)

ఇప్పుడు, వివిధ జీవితరంగాలకు చెందిన భారతీయులు, రష్యన్లు విలాసార్థము, వ్యాపారార్థము ఒకరి దేశంలో మరొకరు పర్యటిస్తున్నారంటే అందులో ఆశ్చర్యపడవలసినదేమీలేదు. అదే విధంగా భారతీయ విద్యార్థులు సోవియట్ పారిశ్రామిక సంస్థలలోను, ఉపాధ్యాయ శిక్షణావిద్యాసంస్థలలోను శిక్షణను పొందుతున్నారు. ఢిల్లీలో సోవియట్ పౌరులు, మాస్కోలో భారతీయ పౌరులు నేడు మనకు సర్వసాధారణంగా అగుపడుతుంటారు.

మాస్కోలో నేడు ఇలా ఉంటున్న భారతీయ పౌరులలో మధుకర్ దేశ్‌ముఖ్ ఒకడు. ఆయన విలాసార్థంగాని, వ్యాపారార్థంగాని రాలేదు. సోవియట్ దేశంలోని విశ్వవిద్యాలయాలలో అన్నిటికంటె పెద్దదయిన మాస్కో విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్న విద్యార్థి యీయన. ఈ విశ్వవిద్యాలయంలో పదిహేన్నురవేల మంది విద్యార్థులు చదువుకొంటున్నారు. వారిలో అనేకమంది విదేశవిద్యార్థులుకూడా ఉన్నారు. ఈయన, గత సంవత్సరమే మరి ఐదుగురు భారతీయ విద్యార్థులతోపాటు ఉన్నత విద్యనభ్యసించడానికి వచ్చాడు.

కొత్త వాతావరణానికి కొద్ది కాలంలో అలవాటుపడడం కష్టమైన విషయమే. కాని మాస్కోలో మధుకర్‌కు అదేమీ పెద్ద సమస్యగా కనబడలేదని, ఈ మధ్య ఆయనను మేము విశ్వవిద్యాలయం హాస్టలులోని అతని రెండుగదుల ఇంట్లో కలుసుకొన్నప్పుడు స్పష్టమయింది. అర్సెన్ కఫాయేవ్ అనే మరొక సోవియట్ విద్యార్థితోపాటు ఆయన ఆ భాగంలో ఉంటున్నాడు. స్వచ్ఛమయిన రష్యన్ భాషలో ఆయన మాట్లాడుతుంటే మాకు ఆశ్చర్యంకలిగింది. రష్యాకు వచ్చేటప్పటికి ఆయనకు రష్యన్ భాష యేమాత్రము వచ్చేదికాదనీ, చదువు సాగించడం కష్టమైపోయిందనీ, అయినా తోటి విద్యార్థులుగా ఉన్న తన మిత్రులసహాయంతో ఆ కష్టాన్ని త్వరలోనే అధిగమించగలిగాననీ ఆయన మాకు చెప్పాడు. మరి ఇప్పుడో? ఆయన అర్థశాస్త్రంమీద గ్రంథాలను చదవడమేగాక తోటి విద్యార్థులతో యేవైనా తీవ్రమైన చర్చ వచ్చినప్పుడు తన దృక్పథాన్ని స్పష్టంగా వివరించగలడు కూడాను.

విదేశ ప్రాంతంలో ఉన్నప్పుడు అనుపించే ఒంటరితనం మధుకర్‌లో కనబడదు. రష్యన్, రుమేనియన్, చైనీస్, పోలిష్ మొదలైన వివిధ జాతులకు చెందిన మిత్రులు ఆయనకు ఉన్నారు. తరుచు వాళ్ళు విలాసయాత్రలకు వెళుతుంటారు. ఈతకొట్టడం, మోటార్ సైకిల్‌మీద తిరగడం మొదలైనవి ఆయన అభిమాన క్రీడలు. నాటకాలకు వెళుతుంటాడు. పుస్తకాల విషయం వేరే చెప్పాలా! గదిలోకి వెళ్ళగానే, అక్కడ అధిక సంఖ్యలో ఉన్న పుస్తకాలు మా దృష్టిని ఆకర్షించాయి. పుష్కిన్, చెర్నిచేవిస్కీ, టాల్‌స్టాయ్, మాయికోవిస్కీ, మకరెంకో, పొలివాయ్ మొదలైన రచయితల గ్రంథాలు వాటిలో ఉన్నాయి. పల్లెపట్టునుండి జనాభా పట్టణాలకు తరలి వెళ్ళడంలాంటి సాంకేతిక సమస్యను గురించి పరిశోధనలను జరుపుతున్నప్పటికీ, తీరిక సమయాల్లో కల్పనా సాహిత్యం చదవడం మధుకర్‌కు సరదా.

మాస్కోనుగురించి తనఅభిప్రాయమేమిటో తెలియజేయమని మేము అడుగగా, ప్రజల జీవితాన్ని గురించి వివరంగా చెప్పడానికి ఒక సంవత్సరకాలం చాలా స్వల్పమయినదని ఆయన సమాధానమిచ్చాడు. అయినప్పటికి, ఆయనకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలు యేర్పడ్డాయి. తనకు పరిచయం యేర్పడిన అందరిలోను వ్యక్తమయిన స్నేహభావము, ఆతిధ్యసత్కారాభిలాష ఆయనను బాగా ఆకర్షించాయి. త్వరిత వేగాన్ని కొనసాగుతున్న నిర్మాణ కార్యాలు ఆయనను మరీ యెక్కువగా ఆకర్షించాయి. ఈ సందర్భంలో ఆయన ఒక చక్కని సంఘటనను మాకు తెలియజేసారు. ఆయన వివరించదలుచుకున్న విషయాన్ని ఆ సంఘటన మరింత స్పష్టం చేయగలదు.

ఆయన గదిలోని కిటికీలోంచి చూస్తుంటే మాస్కో నైరుతి దిక్కు దృశ్యం చక్కగా కనబడుతూఉంటుంది. ప్రస్తుతం అక్కడ

(మిగత 36వ పుట చూడుడు)

తన స్నేహితుడూ, మాస్కో విశ్వవిద్యాలయపు పత్రికా రచనా విభాగ విద్యార్థి వ్లాదిమిర్ మిఖల్‌ఛెన్కోతో మోటార్ సైకిలు తొక్కడమంటే మధుకర్‌కు ఎంతో ఇష్టం



# రక్షణ

బోరిస్ లాస్కిన్

ఇంతకు మునుపెప్పుడూ మీరు, మిఖైల్ స్తెపనోవ్‌ను కలుసుకోక పోయినా, ల్యుద్మిలా ఫోమినాను గురించిగానీ, సెర్గీ కరెత్నికోవ్‌ను గురించిగానీ వినకపోయినా, యీ ముగ్గురు యువకులూ నాకు సన్నిహిత మిత్రులు.

మేమంతా ఒక్కచోటనే, ఒకే ఆటస్థలంలో ఆడుకొన్నాము, ఒక బళ్ళో చదువుకొన్నాము. ఒకేసారి ముగ్గురం పుష్కిన్ గురించీ, డికెన్స్ గురించీ తెలుసుకున్నాము. ముగ్గురం కలసి బీజగణిత సమస్యల సాధిస్తూ చెమటోడ్చాము, పాఠశాల ఉన్నత పరీక్షలో ముగ్గురం ఒకేసారి ఉత్తీర్ణులమయ్యాము.

అంతమాత్రంచేత వాళ్ళను మాకు పరిచయం చేయవలసిన అగత్యం నీకేమిటని మీరనవచ్చు. అయినా కొస్త చనువు తీసుకొంటున్నాను, ఎందుకంటే ఒక స్నేహితుడి జీవితంలో ఇటీవల జరిగిన ఒక సాహస ఘట్టాన్ని చెబితే మీకు తమాషాగా వుంటుందని, నా నమ్మకం.

బహుశా, పాఠకులలో కొందరు కొత్తవాళ్ళతో పరిచయం చేసుకోరపోవచ్చును కూడా.

ఆ అద్భుత ఘటననుగురించి చెప్పబొయ్యేముందు, నా స్నేహితుల స్వభావాన్ని కొస్త వివరించక తప్పదు.

ఒక వ్యక్తియొక్క నడత, తీరూ ఎప్పుడూ నాకోవిధమైన ఆకర్షణగా వుంటుంది, ఈ కథను మీరు ఓపికగా చివరదాకా చదివి, నా కథా నాయకుల్ని గురించీ, మరీ ముఖ్యంగా ఇప్పుడుచెప్పబోయే అద్భుత ఘటనలతో ఎవరికైతే సంబంధం వుందో, ఆ వ్యక్తిని, మిఖైల్ స్తెపనోవ్‌ను గురించీ తెలుసుకుంటారని, నిజానికి నేనెంతో ఆశిస్తున్నాను.

మిఖైల్, లేకపోతే మేము ముద్దుపేరుతో పిలిచే మిషా, చాలా మంచివాడు. చదువులలో కూడా వాడిదే పైచెయ్యి, ఆ తర్వాత కూడా ఎంతో మంచి కార్యకర్త అనిపించుకున్నాడు.

చూడండి యీ మన ప్రపంచంలో లోపాలు లేనివాడంటూ వుండడు, మిషాకూ పట్టుదల అనేది లేదు, దేన్నీ అంటిపెట్టుకొని వుండడు.

మేము ఈ సంగతి ఎన్నోసార్లు చెప్పాము; మరీ అతను ప్రేమ గాథలో పడ్డప్పుడు యెంతో గట్టిగా చెప్పాము; ఊహూ! ఆ పిల్ల అంగీకారం కోసం రవ్వంత ప్రయత్నం కూడా చెయ్యలేదు.

* * *

ఒకప్పుడు, మిషాకు ఒక విచిత్రమైన సిద్ధాంతంవుండేది; మానవ కోటి నంతటినీ రెండువర్గాల క్రింద విభజించ వచ్చుని; అదృష్ట వంతులు, దురదృష్ట వంతులని.

ఇహ చెప్పనవసరంలేదు, రెండోవర్గానికి అతన్ని ఒక ఘనమైన ఉదాహరణగా చెప్పవచ్చు.

ఈనాటికీ, దురదృష్ట వంతుణ్ణన్న ఒక విపరీతమైన నమ్మకం వాడికి వుంది.

మిషాకు ఉన్న చిక్కల్లా, పేరుకోసం ప్రాకులాడటంలోనే వుంది.



మా ముగ్గుర్లోనూ వాడొక్కడే కీర్తి వాడి నెత్తినే పొద్దు పొడుస్తుందని, ఆ శుభ ముహూర్తాన్ని గూర్చి ఎన్నో కలలు కన్నాడు; ఆ ప్రఖ్యాతి అనేదాన్ని ఇంతవరకూ పొందనిదీ వాడొక్కడే.

వేలాది మైళ్ళ దూరంలో వున్న కజక్ స్టెప్పుల లోని బీళ్ళను దున్నడానికి పోయిన ఉత్సాహవంతులలో ఒకడుగా, వెళ్ళాడు సెర్గీకరెత్నికోవ్.

అక్కడ, అతనుఎంతబాగా పని చేశాడంటే, దానివల్ల దేశం అంతటా అతని పేరు మోగిపోయింది.

అతని ఛాయాచిత్రాలు వార్తా పత్రికలన్నింట్లో వచ్చాయి. శీతకాలంలో, మళ్ళీ మాస్కోకు వచ్చాడు, క్రెమ్లిన్ భవనంలోని జార్జిహాలులో, సంవత్సరాది యువజననృత్యానికి ఆహ్వానింపబడ్డాడు.

అక్కడొక చక్కని అమ్మాయితో నృత్యంచేశాడు. ఆవిడొక మంచి నర్తకి అయింది తర్వాత.

ఈ దంపతులిద్దరూ దారిన నడుస్తుంటే, క్షణం ఆగి చూడనివాడు, చూచి మెచ్చుకోని వాడంటూ వుండడు; ఆవిడ ప్రఖ్యాత నర్తకైతే, ఆయన ప్రఖ్యాతుడైన ట్రాక్టర్ డ్రైవర్.

ఇంక ల్యుద్మిలా ఫోమినా, మా ల్యుద్మిలా, మాస్కో విశ్వ విద్యాలయంలో ప్రవేశించింది.

ఒక పెద్ద భూగోళ శాస్త్రజ్ఞురాలవుతుందని, మేం జోస్యం చెప్పాము. ఒక వెలుగు వెలుగుతుందనుకున్నాం. అంతా అనుకోనట్టు జరిగింది.

విశ్వవిద్యాలయ నాట్య బృందం, ఛెకోవ్ నాటకం "ముగ్గురు చెల్లెళ్ళను" ప్రదర్శించింది, ల్యుద్మిలా ఇరినా పాత్ర ధరించింది.

ఈ ప్రదర్శన చూచిన వాళ్ళ పూర్వపు ఫిజిక్స్ ప్రొఫెసర్, ఆవిడ నటనను చూచి యెంత తన్మయుడైనాడంటే, ఆ మర్నాడే ఆయన, ఆవిడ కూర్చున్న ఫిజిక్స్ పరీక్షలో "ఎక్సలెన్ట్" అనేశాడు, నిజానికి ఆవిడ మంచి విద్యార్థినే కావొచ్చు, ఆమెను "మంచి" విద్యార్థిని అంటే సరిపొయ్యేది.

ఆరునెల్ల తర్వాత, ల్యుద్మిలా జులియట్ వేషం వేసింది. ప్రదర్శనానికి ముందు ఆవిడ యెంతో భయభయంగా వున్నది. తను చెప్పవలసిన సంభాషణను పదేపదే మననం చేసుకొంటున్నది. ఎంత తడబడ్డది?

ఒక్కసారి తెర యెత్తాక, ఆవిడ మళ్ళీ యథాస్థితికి వచ్చింది.

మొదటి అంకం ప్రారంభమైనప్పటినుంచీ, ఆ నాటకం చూడడానికి అతిథిగా వచ్చిన, ఒక ప్రసిద్ధనటుడు, ఆవిడ నటనా చాతుర్యం చూచి యెంత ఉత్సాహపడ్డాడంటే, అదిచూచి మేము, అప్పుడప్పుడే

ఆవిడను పరివేష్టించుకొంటున్న ప్రభామండలాన్ని చూడగలిగాము.

* * *

ఇంక మిషా —వాడట్లాగే పేరుకోసం ప్రాకులాడుతున్నాడు, హఠాత్తుగా యెప్పుడో ఒకసారి తెల్లవారినట్టు, కీర్తివచ్చివాలుతుందను కుంటున్నాడు.

ఆ మాటే మేము గుచ్చిగుచ్చి అడిగితే, భుజాలెగరేసి :

"చూడండి, కాస్త ఓపిక పట్టండి, మిత్రులారా, ఏనాడో ఒక నాడు నాగురించి వినకపోర్లే", అనేవాడు.

నిజానికి చివరకు వినేనే విన్నాము.

ఒక ఆదివారం, మిట్ట మధ్యాహ్నాన ఇది జరిగింది. ఒక పని మీద వస్తానన్న రోజున ట్రాలీ బస్సులో పోతూ పగటికలలు కనడం మొదలు పెట్టాడు.

ప్రశంసిస్తోన్న ప్రజా సమూహం మధ్యన, తనొక పెద్ద వీర కృత్యం చేస్తున్న పరాక్రమవంతుణ్ణను కున్నాడు.

కళ్లు మూసుకొని, ఊహా ప్రపంచంలో స్వైర విహారం చేస్తు న్నాడు. కాసేపటికి, ఉయ్యాల ఊపినట్టూచిన బస్సు ఊపుకు; సుమ కిరీటాన్ని తనకు పెడుతున్నట్టు, తన్ను మెచ్చుకుంటున్నవాళ్ళు, భుజాలమీద వేసుకొని వీధుల్లో ఊరేగిస్తున్నట్టూ భావించుకున్నాడు.

చిరునవ్వులో కళ్లు విప్పాడు.

ఆ వీధిలోని దృశ్యంకూడా, అతని వీరగాథకు అంకురార్ప ణగా వుంది. వీధికి అడ్డంగా జనం, పెద్దగుంపు వాడకట్టులోని ఒక మేడపై అంతస్తు కిటికీల వంక రెప్పవాల్చకుండా చూస్తున్నారు. ఆ కిటికీలలో నుంచి కారు మేఘాలలాంటి, పెద్దపెద్ద పొగమబ్బులు అలలు అలలుగా వస్తున్నాయి.

అగ్నిమాపకులు నీటి గొట్టాలనుంచి నీళ్ళు చిమ్ముతున్నారు.

ట్రాలీ బస్సుమీదినుంచి మిషా చివాలున దూకి, తగలబడు తున్న ఇంటివైపు పరిగెత్తాడు.

జనంలోనుంచి దూసుకపోయి, ఆ మేడతూము పంపు పట్టు కొని, ఒక పెద్ద జట్టీలాగా పైకి ప్రాకాడు.

రెండో అంతస్తు కెక్కాక, క్రిందికి చూచాడు. నిశ్చేష్టులై నజనం, ఒక పెద్దగుంపు, అతనివంక రెప్ప వాల్చ కుండా చూస్తున్నారు.

మంటలార్పే నీటి పంపులలో నుంచి జలజల ప్రవహిస్తున్న నీళ్ళ చప్పుడు,

మృదంగ ధ్వానంలా వుంది.

మిషా మేడమీది కెక్కాడు. ఇప్పుడతనికి కావలసిన కీర్తి, అతని కళ్ళముందు నృత్యం చేస్తుండడం అతను దర్శించాడు.

నాలుగో అంతస్తుదాకా యెక్కేసి, అక్కడొకకిటి కీలోనుంచి దూకాడు.

ఇల్లంతా పొగలు కక్కుతున్నది. ఎటు చూచినా కమ్ముక పోతున్నది పొగ. లోపల ఎంతో మంది మనుషులున్నారు. ఒక మూలన ఎవరో ఒక వ్యక్తి బిగ్గరగా పిలు స్తున్నాడు.

* * *

ఒక్క దూకుదూకి మిషా అతన్ని సమీ పించాడు. వృథా మాట లెందుకనుకొని, అతన్ని వాటేసుకొని భుజంమీద మోపులా



వేసుకున్నాడు. పొగచూరి కళ్లు చిమచిమలాడిపోయి. పోతున్నవాడల్లా, దానాపున ఒక వాకిలి తలుపుని కొట్టుకున్నాడు.

ఆ ద్వారానికి ప్రేలాడ వేస్తున్న ఒక పట్టుచెరగు లాగి, తన భుజంమీది మనిషిని ఆపాదమస్తకం కప్పేసి, మంటలు తప్పించు కుంటూ దారి తీస్తున్నాడు.

రక్షింపబడ్డ ఆ వ్యక్తి, మూట గట్టినట్టు ఆ ముసుగులో ఏదో వెర్రిగా తన్నుకుంటున్నాడు, ఆ భయంతో అతను తెలివితేటల్ని కోల్పోతున్నట్టుంది.

పెద్దగా ఆ వ్యక్తి పిలుస్తున్నాడు ఒక పేరును. అతనికి దారి తోచడంలేదు. బాగా అడ్డుగావున్న ఆ తెరలోనుంచి అతని గొంతుక కూడా వినిపించడం లేదు.

"భయపడొద్దు." అని చెప్తూ, "చేతుల్లో ఊరికినే తన్ను కోకు. ఇద్దరం పడిపోతాం" అని అతన్ని మిషా హెచ్చరించాడు కూడా.

"ఊరికే అరవకు! మీకెట్లా అనిపిస్తుందో నేనెరుగకపోలేదు, ఇంకా పైన కొందర్ని వదిలిపెట్టి వచ్చి వుండొచ్చు. భయపడకు, నేను వాళ్ళందర్నీ రక్షిస్తాను!"

ఆ మనిషికి, ఆ ఊరడింపు మాటలు ఏమీ రుచించినట్టు లేదు.

చెబుతున్నకొద్దీ అతను పెద్దగా మూలుగుతున్నాడు. మిషా అన్నట్టు, కాలిపోతున్న ఇంట్లో వదిలిపెట్టి వచ్చిన పసిబిడ్డలమాట, అతన్ని కలతపెట్టింది. ఉగ్రుడవుతున్నాడు. ఉద్వేగమైన నిస్పృహలో పడ్డట్టయింది.

"నన్ను పోనీ"....ఎక్కడికి తీసుకెళ్తున్నావు నన్ను ?" అని పెద్దపెట్టున అరుస్తున్నాడతను.

"కాస్త తమాయించండి"...."వసివంటావు కృతజ్ఞత చెప్ప డానికన్నా నువ్వు బ్రతకాలి" అన్నాడు సాధికార స్వరంలో మిషా. ఆ గొంతులో బాధకూడా ప్రతిధ్వనించింది. "రెండడుగులు దాటనీ, నువ్వు సురక్షితంగా వుంటావు," అన్నాడు.

నేలమీదకు ఒక్కదూకుదూకి మిషా, నదు మణిగివున్న జనంమధ్యకు తన భుజాలమీది విలువైన బరువుతో ఠీవిగా నడిచాడు.

అటువంటి తరుణంలో, సహజంగానే అక్కడ ఒక వార్తా పత్రిక ఛాయాచిత్రగ్రాహకుడు ప్రత్యక్ష మైనాడు.

కెమేరా 'క్లిక్' మనడం, మిషా మనస్సుకు ఒక పెద్ద ఉప శాంతి అయింది.

"చివర కిక్కడ దొరికింది—నిజమైన కీర్తి, నిజమైన ఖ్యాతి" అని ఎంతో సంబరపడ్డాడు మిషా. జాగ్రత్తగా భుజంమీది మూటను పేవ్‌మెంటుమీదకు దింపుకొన్నాడు.

పరిరక్షించబడిన ఆ వ్యక్తికి, ధాతు ప్రపృస్పర్శలో ఏదో విద్యుత్ప్రేరణ కలిగి నట్టయింది.

అతను చెంగున పైకి గెంతేటప్ప టికి, షేక్స్పియర్ నాటకంలో వేషగాడి ముసుగూడినట్టు, ఛటుక్కున ఆ తెర జారి పడింది. మిషాకు గ్రుడ్లు పీకేసినట్టయింది.

కాళ్ళు వంగదీసుకొని, బరువుగా ఊపిరి పీలుస్తూ, ధూమ్రవర్ణుడైన అగ్ని మాపకుడొకడు, బొగ్గుమీసాలతో, మండి పడుతూ తోక త్రొక్కిన త్రాచులా అతని ముందర నిల్చున్నాడు.

# చెప్పినమాట వినని సైకిల్

మిత్యా, సైకిలు కొనిపెట్టమని తండ్రిని ఎన్నాళ్ళనుంచో అడుగుతున్నాడు. తండ్రి మాత్రం కొనకుండా—మొదట అడిగినప్పుడు ఒక సాకూ, ఇంకొకమాటు ఇంకొకటీ చెబుతున్నాడు.

చివరకు తండ్రి అన్నాడు: "నీ కాళ్ళు చాలా పొట్టి, పెడల్సుకూడా అందవు. కాస్త వాటిని ఎదగనీ. ఈలోగా, నేనుకూడా సైకిలు కొనడానికి తగినంత డబ్బు సంపాదిస్తాను!"

ఆనాటినుంచీ మిత్యా తల్లిని ఊపిరాడ నివ్వలేదు. నిద్ర మంచంమీదినుంచి లేస్తూనే వాళ్ళమ్మను అడిగేవాడు:

"చూడు నా కాళ్ళు కాస్త ఎదిగాయో, లేదో"?

తల్లి బహుశ్రద్ధగా చూచేది, చూచి అనేది: "అంత, నలుసంత, మొత్తానికి పెరిగాయి."

మిత్యా తనకు పెట్టిన ఆహారమంతా తినేసేవాడు, కాళ్ళు కాస్త పొడుగవుతాయేమోనని.

చిట్టచివరకు, మిత్యాకు నాలుగేళ్ళు వచ్చేసరికి, తండ్రి సైకిలు కొనుకొచ్చాడు. దానికి ముచ్చటగా మూడు గాళ్ళున్నాయి. ఇంతకు ముందు అతను చూచిన వాటన్నింటికన్నా ఎంతో బాగుంది.

అది రావడం ఎంతో ఆహ్లాదంగానేవుంది, అయినా దానికి కొన్ని చిక్కులుకూడా లేకపోలేదని, మిత్యా కనిపెట్టాడు.

"మిత్యా ఇంట్లోకి రా" అని వాళ్ళమ్మ పిలిచేది.

"అమ్మా, ఇప్పుడే, కాసేపట్లో వస్తా" అని జవాబుచెప్పి, మిత్యా చకచకా పెడల్ త్రొక్కేవాడు.

"ఊ, తొందరగా రా!"

మారుమాట చెప్పకుండా మిత్యా, ఆటస్థలంలో ఈ కొసనుంచి ఆ కొసకు సైకిల్ తొక్కుకపొయ్యేవాడు.

"నా గొంతు చించుకోవలసిందేనా, మరేమన్నానా?" అనేది అమ్మ కోపంగా, అనడమేకాదు మిత్యాను పట్టుకొని లాక్కొచ్చేది, ఏడుస్తూ మిత్యా ఇంటిదారి పట్టేవాడు. ఆవిడే సైకిలు పట్టుకొస్తూ, దారిపొడుగునా తిట్టిపోసేది.

ఇదివరకెప్పుడూ అట్లాగే జరిగేది. ఇక ముందెన్నటికీ అట్లా జరగదుకూడా. ఇప్పుడు పిలుపువస్తే చాలు, (సరిగ్గా, వచ్చిరావడంతోచే!) చివాలున పోతాడు మిత్యా.

ఏం జరిగింది? బహుశా మిత్యాకు యేళ్ళు వస్తుండొచ్చు, వయసు వస్తున్నకొద్దీ తెలివితేటలు వస్తుండొచ్చు! అంతేకాదు, దీనికి ఇంకో కారణంకూడా వుంది.

ఒకనాడు మిత్యా, సైకిలు తొక్కుకోవడానికి దొడ్లోకి వెళ్ళాడు. వెళ్ళికూడా చాలా సేపైంది. తర్వాత వాళ్ళమ్మ పిలిచింది.



"మిత్యా, రా అన్నం పెట్టాను."

"ఒక్క నిముషం" అని జవాబు చెప్పి, మళ్ళీ సైకిలు లంకించుకున్నాడు.

"ఇంకాసేపటికా!" అని అమ్మ అడిగింది మళ్ళీ.

"కాస్త అక్కడిదాకా ఒక్కసారి తొక్కి, తిరిగొచ్చేస్తాను," అని ఎంతో బ్రతిమాలాడు. ఒక్కసారని అన్నాడేగాని అయిదారు ప్రదక్షిణలు చేశాడు.

కొడుకును పిలుచుకరావడానికి తర్వాత తండ్రి వెళ్ళాడు. ఆటస్థలంలోకి వచ్చి, ఆయన మిత్యాను నెమ్మదిగా అడిగాడు:

"ఎందుకు నువ్వు ఇంటికి రావు?"

ఏమని సమాధానం చెప్పాలో మిత్యాకు తోచలేదు. ఒకటి రెండు క్షణాలు గడిచాక, ఎట్లాగో ఒక జవాబు తట్టింది, చెప్పాడు:

"ఈ మూడు కాళ్ళ బండి మన మాట వినదు!"

"ఏమంటున్నావ్?" అని ఆశ్చర్యపోతూ గద్దించి అడిగాడు తండ్రి.

"దీన్ని నేను ఇంటిదారికి తిప్పితే, అది ఇంకోదారి పడుతుంది" అని కాస్త వివరిచాడు మిత్యా.

"అదా సంగతి!"అని, "ఇంతకూ చెప్పిన మాట వినదన్నమాట సైకిల్?" అదేమాట ఇంకాస్త పొడిగించాడు తండ్రి.

"అవునండీ. సరిగ్గా, అది చెప్పినమాట వినదు" అన్నాడు ఉత్సాహంగా మిత్యా.

"మంచిది, అట్లాగయితే ఇంక నువ్వు ఇంటికి పద, చెప్పినమాట విననందుకు దీని పని పడదాము?"

"ఒకటి, రెండురోజులు అటకమీద పారేద్దాము. అక్కడే పడుండనీ దాన్ని."

అంటూనే తండ్రి, అటక తలుపుతీసి, సైకిలు లోపలికి నెట్టి, తాళం వేసేశాడు.

మిత్యా ఇంక చేసేది మటుకేముంది? చప్పిడి గాకుండా వెళ్ళి భోంచేశాడు.

మర్నాడు ప్రొద్దున్నే లేచాడు, స్నానంచేసి, చద్దెన్నం తిన్నాడు. ఏం పొద్దుపోవడం లేదు. చివరకు వాళ్ళ అమ్మను అడిగాడు:

"అమ్మా, అమ్మా నన్ను సైకిలు తీసుకోనియ్యవే."

"నేనెట్లా ఇవ్వను. నాన్నగారు దానికి శిక్షవేశారుకదూ."

"ఎందుకట్లా సైకిలుమీద వంకపెట్టి చెప్పావబ్బా?"అని తనలోతాను ఎంతో పశ్చాత్తాపించుకొన్నాడు. నేను ఆ తప్పు నాదని ఒప్పుకోవలసింది. నాన్న తొందరగా వస్తేనన్నా బాగుండు! నాసైకిల్ నాక్కావాలి?"

"నాన్నగారు ఇంటికి రానే వచ్చారు.

"అబ్బాయ్! హాయిగా కాలక్షేపం అవుతున్నదా?" అని అడిగాడు మిత్యాను చూచీ చూడడంతోటే.

"మిత్యా కిక్కురు మిక్కురు మనలేదు. ఇప్పుడు సైకిలు అడగడం కూడా బాగుండదనిపించింది. అయినా నాన్నగారు, తన

మనసులోని మాట కనిపెట్టినట్టుంది, అందుకే అడిగారు: "సైకిలుపని ఎట్లావుందని?"

మిత్యా తల వ్రేలాడేసి, "అది ఏడుస్తున్నది నాన్నా," అన్నాడు.

"ఎందుకు ఏడవడం ?"

"పాపం, ఒక్కతే అక్కడుండాలంటే"

"ఏడిస్తే ఏడవనీ. ఈసారి నీమాట వినకపోతే ఏమవుతుందో బాగా తెలిసొస్తుంది!"

"చాలాసేపు, ఎంతో వెనుకాడాడు మిత్యా, చివరకన్నాడు: "ఇహ అది చెప్పినమాట వింటుంది."

"అట్లాగని అది, నీకు వాగ్దానంచేసిందా?" అని అడిగాడు తండ్రి."

"ఊ ఊహూ."

"మరి అట్లాంటప్పుడు, దాన్ని బయటికి తియ్యవచ్చు," అన్నాడాయన. మళ్ళీ ఎప్పటి లాగానే మిత్యా హాయిగా ఆట స్థలమంతటా సైకిలు తొక్కేస్తున్నాడు.

ఇప్పుడూ రోజుకుమల్లే, సైకిలు మీద బైటికి షికారు వెళ్తాడు. మిత్యా ఎంత చెబితే అంత. అమ్మగానీ, నాన్నగానీ "మిత్యా" అంటే చాలు, గొంతుపట్టి సైకిలు దానంతటదే, పట్టుప ఇంటిముఖం పడుతుంది!

## వారు భారత దేశం నుంచి వచ్చారు

(11వ పుట తరువాయి)

విషయాలను తెలుసుకొనడం. ఉత్సవ కార్యక్రమం ఎడతెరిపి లేకుండా ఉన్నప్పటికీ వారు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ఫ్యాక్టరీలు మొదలైన చూడవలసిన స్థలాలను చూడడానికి దొరికిన అవకాశాన్నల్లా ఉపయోగించుకొన్నారు. అన్ని విషయాలలోను వారు ఆసక్తిని చూపారు.

భారతీయ ప్రతినిధులు ఇలా ఆసక్తి చూపినట్లే సోవియట్ దేశ ప్రజలు కూడా వారిపట్ల యెంతో ఆసక్తిని చూపారు. వారికి ఆతిధ్యమిచ్చిన సోవియట్ యువజనులూ, సోవియట్ ప్రజలూ భారత దేశానికి సంబంధించిన అన్ని విషయాలను గురించి తెలుసుకొనడానికి కుతూహలపడ్డారు. భారతీయ అతిధులు యెక్కడికి వెళ్ళినా సోవియట్ ప్రజలు వారిచుట్టూచేరి ప్రధాని నెహ్రూనుగురించీ భారత దేశ శాంతి విధానాన్ని గురించీ, ఆ దేశపు అద్భుతమైన చారిత్రకావశేషాలు, సాహిత్యాలను గురించీ ప్రశ్నలడుగుతుండేవారు.

మిత్రులమధ్య ఇలానే ఉండాలి. భారత దేశం, సోవియట్ దేశాల ప్రజలమధ్య మైత్రి నానాటికీ పెంపొందుతోందని ఉత్సవం నాకు మరొకసారి స్పష్టం చేసింది. ఉభయ దేశాల ప్రజలు శాంతి కొరకు నిలబడుతున్నారుగాబట్టే అదలా పెంపొందుతోంది. అఖిల భారత విద్యార్థి కాంగ్రెస్ అధ్యక్షుడు ఒలీవ్ పెన్ అడెల్ సరిగ్గా యీ విషయాన్నే వెల్లడించాడు. "నెహ్రూ సోవియట్ దేశంలోను, బుల్గానిన్, కృశ్చేవ్‌లు భారత దేశంలోను పర్యటించిన తర్వాత సోవియట్ దేశం, భారత దేశాల యువజనులమధ్య మైత్రి మరింత బలపడింది. కాలం, రచితం కాలబాలపల్ల యేర్పడిన కృత్రిమపు పొగతెర, భారతీయ ప్రజలూ, సోవియట్ ప్రజలూ శాంతికొరకు నిలబడుతున్నారుగాబట్టి తొలగిపోయింది. మేము యెక్కడికి వెళ్ళినా మాస్కో వాసులు మాకు స్వాగతమొసగారు. మాకు రష్యన్ భాష రాకపోయినా మేము ఒక్కటయ్యామని మాకనుపిస్తుంది. సోవియట్ దేశం, భారత దేశాల ప్రజలు సోదరులు."

## మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థి మధుకర్ దేశ్‌ముఖ్

(32వ పుట తరువాయి)

కొత్త గృహాలు నిర్మింపబడుతూఉన్నాయి. చిత్రలేఖనం అంటే ఇష్టంగల మధుకర్ గత ఆకురాలు కాలంలో ఆ దృశ్యం యొక్క చిత్రాన్ని వ్రాయడం ప్రారంభించాడు. కాని యెందువల్లనో దానిని పూర్తిచేయలేకపోయాడు. తీవ్రమైన మంచుతో మాస్కో శీతాకాలం ప్రారంభమయింది. అనేక మాసాలవరకు ఆ కిటికీ తలుపుల అద్దాలకు మంచుపట్టుకొని ఉండిపోయింది. కాని వసంతకాలం ప్రారంభదినాలల్లో, కిటికీ అద్దాలపైన మంచులేని ఒకరోజున మధుకర్‌కు అసంపూర్తిగా ఉన్న తనచిత్రం గుర్తుకొచ్చింది. దానిని పూర్తిచేయడానికి ఆల్బమ్ తెరచి, పెన్సిల్ పట్టుకున్నాడు. కాని.ఆయన హఠాత్తుగా గమనించిందేమిటంటే, తాను చిత్రం వేసేటప్పుడు ఇదివరకు చూచిన దృశ్యానికీ, ఇప్పటి దృశ్యానికీ పోలికేలేదు. ఆ స్థానంలో తెల్లని ఒక పెద్ద భవనం కనబడుతున్నది. ఇదివరకు తానుచిత్రంలో వేసిన పరంజాలు, క్రేన్లు యేవీ కనబడడంలేదు.

"ఈ సంఘటన నాకు యెన్నో విషయాలను అవగతం చేసింది," అన్నాడు మధుకర్. ఆయనకు చాలా ఆసక్తిదాయకమయినదిగాను, ముఖ్యమయినదిగాను తోచిన మరొక విషయాన్ని గూడా ఆయన తెలియజేసాడు. "ప్రతి ఉదయం వార్తల అనంతరం రేడియోలో వివిధ పారిశ్రామిక సంస్థల్లోను, గృహనిర్మాణ సంస్థల్లోను ఉన్న ఖాళీ ఉద్యోగాలను గురించీ, ఉద్యోగ నియామకాలను గురించీ ప్రకటన జరుగుతూ ఉంటుంది. బహుశ సోవియట్ దేశ శ్రోతలకు ఇవి మామూలు విషయాలుగానే కనబడవచ్చునుగాని, నన్నుమాత్రం బాగా ఆకర్షించాయి," అన్నాడాయన.

మధుకర్ ఈ మధ్యనే కీవ్ నగరానికి వెళ్ళి తిరిగి వచ్చాడు. తన మిత్రులతోపాటు అక్కడ ఒక విశ్రాంతిగృహంలో బసచేశాడు. అక్కడ అనేక ఆరోగ్య కేంద్రాలను ఆయన చూచి వచ్చాడు "సామాన్య ప్రజలు తమ సెలవుదినాలను హాయిగా అక్కడ గడుపుతూ వుండడం" ఆయన కనుగొన్నాడు. "సామాన్య ప్రజలు ఇలాంటి అందమైన విశ్రాంతి గృహాలలో తమ సెలవులను గడుపుతున్నారంటే, ఆ దేశం చాలా మంచిదయి వుండాలి," అంటూ ముగించా డాయన.

మధుకర్ మాస్కోలో యెంతో ఆనందంగా ఉన్నప్పటికీ. స్వగృహంలో పొందే ఆనందానికి అది సాటివస్తుందా. తన కుటుంబాన్ని చూడాలని కుతూహల పడుతుంటాడు. బొంబాయి రాష్ట్రంలోని అకోట్ అనే ఒక చిన్నపట్టణంలో అతని భార్య లీలావతి, బిడ్డలు జవహర్, అర్చనలు ఆయన రాకకొరకు యెంతో యెదురు చూస్తున్నారు. మాస్కోనుండి ఆయన యెప్పుడు తిరిగివెళ్ళేదీ ఇంకా ఖచ్చితంగా తెలియదు. ఉంటే ఇంకొక సంవత్సరంపాటు వుండవచ్చు, లేదా అంతకంటే ముందే వెళ్ళవచ్చు. ఒకవిషయం మాత్రం స్పష్టం. ఆయన కొత్త మిత్రులు ఆయన వెళ్ళిపోతున్నాడంటే విచారపడుతారు. ఆయన నెప్పుడూ గుర్తుంచుకొంటారు.

# బొంబాయిలో "తొవరిష్" నౌక



భారత సోవియట్ సంస్కృతీ సంఘపు బొంబాయి శాఖ సోవియట్ నావికులకు స్వాగత సభ ఏర్పాటుచేసింది. చిత్రంలో, ఇస్కస్ అధ్యక్షుడు, డాక్టర్ బాలిగ నౌకాధిపతి వి. వాసిలియేవ్‌కు పుష్పహారాన్ని వేస్తున్నారు ↓




భారత సోవియట్ సంస్కృతీ సంఘ బొంబాయిశాఖ యిచ్చిన స్వాగత సందర్భంగా, భారత మిత్రులమధ్యవున్న సోవియట్ నావికులు ↓




ప్రజలనేకులు సోవియట్ శిక్షణా నౌకమీది కెక్కినప్పుడు, సోవియట్ ↑ నావికులు వారికి అభివందనం చేశారు



నౌకా శిక్షణనిచ్చే సోవియట్ నౌక "తొవరిష్", 200 మంది శిక్షార్థులతో ఒడెస్సా నుంచి, 24,000 మైళ్ల తన సముద్ర యాత్రలో గత మాసం బొంబాయికి వచ్చింది.

సోవియట్ నావికులు ఒక వారంరోజులు నగరంలో గడిపారు. అక్కడి కట్టడాలు, నగర దృశ్యాలు వారిని ఎంతో ఆకర్షించాయి. మరీ వారిమనస్సుకు హత్తుకపోయినది ప్రజలు హృదయపూర్వకంగా వారికిచ్చిన ఘనమైన స్వాగతం.





# నూతన పాఠ్య సంవత్సరం

## రష్యన్ సమాఖ్య పౌర విద్యాశాఖ, ఉపమంత్రి పి. ఐ. జిమిన్‌తో ఇంటర్వ్యూ



సోవియట్ దేశమంతటా, వేసంగి సెలవుల తర్వాత, 1 సెప్టెంబరున, నూతన పాఠ్య సంవత్సరం ప్రారంభమైంది.

విద్యా విభాగంలో అభివృద్ధికరమైన కొత్త చర్యలు ఏమేమి గైకొనబడ్డాయి, రానున్న కొత్త సంవత్సరంలో పాఠశాల విద్యార్థులకని ఉద్దేశింపబడిన దేమిటి ? అని తెలుసుకొనే దానికై, మేము, రష్యన్ సమాఖ్య, విద్యాశాఖ ఉపమంత్రి, పి. ఐ. జిమిన్‌ను సందర్శించి, ఈ సందర్భంగా ఆయన అభిప్రాయాలను వివరించమని కోరాము.

విద్యా సమస్యలకు సంబంధించిన వివిధ దృక్పథాలను ఆయన సుదీర్ఘంగా వివరించారు. ఆయన చెప్పిన దానినిబట్టి కొత్తగా ఎన్నో పాఠశాలలు కట్టబడ్డాయి, మరికొన్ని నవీనంగా నిర్మాణమవుతున్నాయి. పాఠశాలల భవనాలు మరమ్మతు చేయబడ్డాయి. అనేక పాఠశాలలకు విద్యాబోధనకుగాను పరికరాలు, పాఠశాలల గ్రంథాలయాలకు కొత్త









పుస్తకాలు సరఫరా చేయబడ్డాయి. ఇప్పటి పాఠశాలల సంఖ్య 213,000 మేరకు వచ్చింది.

పాఠశాలా విద్యార్థులందరికీ పాఠ్య పుస్తకాల సరఫరా చేయడమన్నది సామాన్య విషయం కాదని, ఇతర దేశాల ప్రజలు ఎరిగినదే. సోవియట్ దేశానికి పాఠ్యగ్రంధాల కొరతలేదు. కొత్త సంవత్సరం కోసరమని, 225 మిలియన్ల పాఠ్య గ్రంథాలు అచ్చువేయబడ్డాయని జిమిన్ చెప్పారు. సోవియట్ దేశములోని రిపబ్లిక్కు లన్నింటిలోను విద్యార్థులకు, విద్యాబోధన జాతీయభాషలలోనే గరపబడుతుందన్న విషయం సువిదితమే, పాఠ్య గ్రంథాలు 76 భాషలలో వెలువరించబడ్డాయి.

పౌర విద్యావ్యయానికి సంబంధించి, ఈ ఒక్క సంవత్సరంలోనే, ఈ విద్యకుగాను 79,000 మిలియన్ల రూబుళ్ళు, ఇంత పెద్ద మొత్తం ఖర్చుపెట్టబడినట్లు జిమిన్ ఉదహరించారు. 1950–51 సంవద్సరంలో యీ శాఖకు ఖర్చుపెట్టబడిన మొత్తానికన్న ఇది 22,000 మిలియన్ల రూబుళ్ళ యెక్కువ. ఈ అదనపు పెరుగుదలకు కారణం, జాతీయాదాయపు పెరుగుదల, సైనిక వ్యయాలలో పెద్ద మొత్తాలను సోవియట్ ప్రభుత్వం తగ్గించడమని ఆయన అభిప్రాయ మిచ్చారు, దీని వల్ల, ముఖ్యంగా పౌర విద్యావ్యాప్తిని విస్తృతం చేయడానికి వీలు కలిగింది.

ఏటేటా విద్యార్థుల సంఖ్యలో గమనార్హమైన పెరుగుదల వుంటున్నదనికూడా జిమిన్ అన్నారు. ఉదాహరణకు, ఆరు సంవత్సరాల క్రితం 18,36,000 విద్యార్థులు, 8–10 తరగతులలో చదువుతుంటే యీ సంవత్సరం, ఆ తరగతులలో 6,135,000 మంది విద్యార్థులున్నారు. దాదాపు 50 మిలయన్ల వరకూ వివిధ విద్యాలయాల్లో, విద్యా సంస్థలలో చదువుతున్నారు.

ఏదేశపు ఆర్థిక వ్యవస్థలోనైనా పోలీటెక్నికల్ ట్రెయినింగు ప్రముఖపాత్ర వహిస్తుంది. ఈ శిక్షణ ఏవిధంగా సోవియట్ దేశంలో ఆచరణలో పెట్టబడుతున్నదన్న ప్రశ్నకు జిమిన్ సమాధానమిస్తూ, నూతనమైన అభివృద్ధికరమైన శిక్షణ కార్యక్రమం, రష్యన్ సమాఖ్య విద్యామంత్రాంగ శాఖ, బోధనశాస్త్ర విజ్ఞాన పరిషత్తు సంయుక్తంగా 20వ పార్టీ మహాసభ తీర్మానానుగుణంగా రూపొందించినది, ఇప్పుడు పోలీటెక్నికల్ ట్రెయినింగు నిస్తున్న పాఠశాలలో అమలువరచబడుతున్నదని చెప్పారు. ఇది, ఒక నూతనమైన, విస్తృతమైన "పారిశ్రామిక, వ్యవసాయక ఉత్పాదనకు ప్రాతిపదిక" కాగల విద్యావిధానాన్ని ప్రవేశపెట్టను అవకాశాన్ని కలిగించినది. ప్రస్తుతం 8–10 తరగతులలో, యాంత్రిక, విద్యుత్, వ్యవసాయ విషయాలకు సంబంధించిన 'ప్రాక్టికల్‌పాఠ్యపద్ధతికి ప్రత్యామ్నాయంగా యీ కొత్త పద్ధతి అమలుకు వస్తుంది.

ప్రాక్టికల్ ట్రెయినింగ్‌తో పాటు, శాస్త్ర విజ్ఞానానికి, మానవ ధర్మశాస్త్రానికి సంబంధిం





# రాత్రి ప్రయాణం

ఇటీవల మీ పత్రికలలో, కాన్‌స్తంతిన్ పౌస్తొవస్కీ విరచించిన "రాత్రి ప్రయాణం" అనే కాల్పనిక కథ వెలువడింది. నిజానికి ఇది ఎంతో మనస్సుకు హత్తుకపొయ్యేటట్టుగా, గుండె ఝల్లనిపించేటట్టుగా వుంది.

మేము రైతుల్నిగురించీ, ప్రేమికుల్నిగురించీ, చిత్రకారుల గురించీ, బాటసారుల గురించీ కథలు ఎన్నో చదివాం కానీ, రచయితలమీది రచనలు బహు అరుదు. ఈ 'రాత్రిప్రయాణం' అన్న కథలో, ప్రసిద్ధ దేవతా కథారచయిత, కల్పనా కథకుడు హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్ గురించి చెప్పబడింది.

కథకుడు, ఆండర్సన్ యొక్క కాల్పనిక స్వభావాన్నీ, అపూర్వ భావుకతనూ చిత్రించడానికి ఎంతో ప్రయత్నించాడు. ఎప్పుడు ఎక్కడ సౌందర్యం నిజరూపంలో సాక్షాత్కారమవుతుందో, దానిని ఆయన ప్రశంసించాడు, ప్రస్తుతించాడు. 'రాత్రి ప్రయాణం'లో కూడా, సహచర ప్రయాణీకురాండ్రైన ముగ్గురు పిల్లలలో, ఒకావిడ సౌందర్యాన్నిచూచి అతడు ముగ్ధుడైనాడు. ఆవిడను ఆయన "సౌందర్యాధిదేవత"అన్నాడు. పరవశుడైన ఆయన ఆవిడను ప్రేమిస్తాడు. ఆపిల్లపేరు ఎలీనా. ఆయన ఆవిడ ఇంటికి కూడా వెళ్తాడు. ఈ సంఘటన, పాఠకులకు ఆయన, ఆవిడను పరిణయమాడబోతున్నాడేమోననిపిస్తుంది. అయితే కథలో అట్లా జరగదు, ఆశ్చర్యకరంగా అడ్డు తిరుగుతుంది. ఈ మలుపు, పాఠకులకు తీవ్రమైన నిరాశను కలిగిస్తుంది. ఇప్పుడు, ఆండర్సన్ తనప్రియురాలి దగ్గరకు అంతిమవీడ్కోలు చెప్పడానికి పోతాడు! ఇక్కడ, ఆండర్సన్ అపూర్వ భావుకుడుగా ప్రత్యక్షమవుతాడు, పరమ అలౌకికుడు!

ఆసాంతానికి రచయిత, సర్వసాధారణంగా "నిజమైన ప్రేమ విషాదాంతం"కాక తప్పదనే నానుడి నిజమైనదని ధృవీకరిస్తాడు. ఎలీనాకు విదూరుడై మరణిస్తాడు ఆండర్సన్, ఆయన గుండె ప్రియురాలికోసం పాపం, కొట్టుకుంటుంది....మధురాతి మధురమైన....లావణ్యమైన ఆ సుందర ప్రతిమ....

జీవితానికి, ప్రపంచానికి మానవ హృదయం ఎట్లా ప్రతిస్పందిస్తుందో, దానికి యీ కథ దర్పణంలాగా వున్నది. కథాచిత్రణలో పౌస్తొవస్కీ అపూర్వ చాతుర్యాన్ని చూపించాడు. ప్రకృతి వర్ణనలలో కీట్స్‌బాణీ, ప్రతిభ ద్యోతకమవుతున్నది. శైలిలో, సునిశితత్వం భావ వ్యక్తీకరణలో ప్రసన్నత, వస్తైక్యతలు గమనార్హమైనవి.

—ప్రమోద్‌కుమార్ గుప్తా, బి.కాం.
సలన్‌పూర్, (బరద్వాన్ జిల్లా)

---

(ముందుపుట తరువాయి)

చిన క్రమబద్ధమైన మౌలిక పరిజ్ఞానం కల్పించబడుతుందని జిమిన్ ఉద్ఘాటించారు.

సోవియట్ దేశంలో బోర్డింగ్ పాఠశాలలు మొట్టమొదటి సారిగా నెలకొల్పడానికి సంబంధించిన, ఒక ఆసక్తిదాయకమైన విషయాన్ని జిమిన్ వివరించారు. ఈ శిక్షణకు కొన్ని పాఠశాలలు గత సంవత్సరం తెరువబడ్డాయి. ఇక్కడ విద్యార్థులకు సర్వే సర్వత్రా పాఠశాల వాతావరణం వుంటుంది, ఈ విధానంవల్ల బాలలకు ప్రభుత్వ విద్యా సంస్థలలో విద్యగరపి, వారిని ఉన్నతికి తీసుక రావడానికి ఒక నూతన ప్రభుత్వ విద్యాపద్ధతి అమలుకు తీసుక రాబడింది.

ఇటువంటి విద్యా సంస్థలలో, బాలలు, అక్కడే భోజనంచేస్తూ, అక్కడే వుంటూ చదువుకుంటారు. ఆదివారాలలోనూ, ఇతర సెలవు దినాలలోనూ బాలలు ఇండ్లకు పోతుంటారు. ఈ సంవత్సరం, ఈ బోర్డింగ్ పాఠశాలలు అనేకం నెలకొల్పబడనున్నాయి. విద్యార్థుల తలితండ్రుల దగ్గరనుంచి, వారి ఆదాయాన్నిబట్టి, విద్యార్థుల గుడ్డలకు, భోజన ఖర్చులకు బహు తక్కువ రుసుము వసూలు చేయబడుతుంది.

జిమిన్, సోవియట్ విద్యయొక్క పరమాశయాన్ని గూర్చికూడా సవివరంగా చెప్పారు. ఆయన మాటలలో : "మేము ప్రజల్ని చక్కగా విద్యావంతులను చేసి ఉన్నత స్థాయికి తీసుక రావడానికి, సమగ్ర వికాసాన్ని పరిజ్ఞానాన్ని కల్పించడానికి గాఢ ప్రయత్నం చేస్తున్నాం. అందుచేత, మేము ఒక్క వైజ్ఞానిక, ప్రాయోగిక శిక్షణకే గాక, శారీరక, భావ విషయిక శిక్షణకుకూడా లక్ష్యమిస్తున్నాము. ఈ సంబంధంగా రసాత్మక శిక్షణా దళాలు, క్రీడ, గాయక, సంగీత, నాటక, చిత్రలేఖన బృందాలు అధిక సంఖ్యలో ఏర్పాటు చేయబడుతున్నాయి. బాలల కళాభిరుచిని ప్రోత్సహించను, సోవియట్ దేశ బాలల కళా ప్రదర్శనం, మాస్కోలో ఏటేటా జరుపబడుతున్నది. రిపబ్లికన్ ప్రదర్శనలో యెంపిక చేయబడిన సుందర కళా ఖండాలు ఇక్కడ ప్రదర్శించబడ్తాయి. పాఠశాలలుకూడా విద్యార్థులకు ప్రదర్శనాలయాల, చిత్రకళా నిలయాల, నాటక శాలల, విహారస్థలాల సందర్శనకు పర్యటనలు ఏర్పాటు చేస్తాయి."

తమ సంభాషణను ముగిస్తూ జిమిన్, "మనిషికి మనిషే మిత్రుడ"న్న వాక్యాన్ని ఉల్లేఖించి, సోవియట్ పాఠశాలలు, సోవియట్ జీవిత విధానమూ బాలల్లో పైభావనను, ఉన్నత లక్ష్యాన్ని ప్రబోధిస్తూ, తమ దేశంపట్ల ప్రజలపట్ల, ప్రపంచ ప్రజలపట్ల ప్రేమాభిమానాలను కల్పిస్తున్నా యన్నారు.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ఎన్. కె. డొరొద్నిత్సిన్‌చే ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు: పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.

# ఉత్సవ వినోద చిత్రాలు



ఉత్సవపు ముఖచ్ఛాదన



అందరి చూపులూ ఉత్సవం మీదే




విమానంలో క్రీడాకారుల వినిర్గమనం.




గృహోన్ముఖుడైన మిస్టర్ ఉత్సవం.



